శ్రీరస్తు 

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్య శ్రీమద్దత్తాత్రేయ గురువర్యానుపారంపర్య శ్రీమత్సద్గురు సదానంద సరస్వతీస్వాములవారి శిష్యులగు శ్రీమత్సద్గురు శాంతానంద స్వాములవారిని ముముక్షువులగు కొందరు తమ సంశయనివృత్తికై అప్పుడప్పుడు ప్రశ్నచేయగా వారు కరుణకలిగి సంశయనివృత్తికై ఆయా అవసరమున ప్రత్యుత్తరమిచ్చిన వేదాంతశాస్త్రములయందలి విషయములలో కొన్నియంశములను ముముక్షుజనంబుల కత్యంతోపయుక్తంబుగ నుండునటులయు, లిఖించుకొనుశ్రమపరిహారార్థమైయు థామ్సన్ కంపినియను ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె. విక్రయమునకుగాదు. శబ్దదోష అర్థదోషములనుగమనించలేదు. దీనియందట్టిదోషాదులుండిన, అసూయజెందక సులభోపాయముగ జెప్పబడిన పరబ్రహ్మైక్యజ్ఞానమును సాధించునట్టి సంగతులనుమాత్రము గ్రహించి మహామోహమువలనగలిగిన, దేహము తాననెడియు; తత్సంబంధదుర్వాసనలను పోగొట్టుకొని, బ్రహ్మానందమగ్నులై సుఖింతురని ప్రార్థించెదను.

నిత్యానందంపరమసుఖదంకేవలంజ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం।
ఏకంనిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం।
భావాతీతంత్రిగుణరహితంసద్గురుంతన్నమామి॥

ఓమ్

శ్రీమదఖండనిత్య నిర్మలాద్వయ సచ్చిదానంద పరబ్రహ్మణేనమః.

# పంచకోశవివరణము.

"ఆత్మానామస్థూల సూక్ష్మకారణ శరీరత్రయవిలక్షణః పంచకోశవ్యతిరిక్తః అవస్థాత్రయసాక్షీ సచ్చిదానందరూపః"

పరమాత్మ పంచకోశ విలక్షణుడని శ్రుతులు ఘోషించుచున్నవి గావున పంచకోశములనుయెరుగకనే వాటికి విలక్షణుడైన పరమాత్మనుయెరుగరాదు గాన పంచకోశములను విచారించెదము.

అన్నమయము - ప్రాణమయము - మనోమయము - విజ్ఞానమయము - ఆనందమయము - అని కోశము లైదువిధములు.

అన్నమయకోశమనగా?

"అన్నవికార శుక్లశోణితజన్య షడ్భావ వికారసహితం అన్నేనైవ వర్ధమానం ఇదంస్థూల శరీరమన్నమయకోశః"

"శుక్లశోణిత సంభూత దేహోన్నమయ
ఉచ్యతే"

(శ్రు) "అన్నకార్యాణాంసమూహోన్నమయః
కోశః"

అనురీతిని అన్నమువలన పుట్టి అన్నమువలననే వృద్ధిబొందుచున్నదై స్తంభమువలె స్థూలమై కరచరణాద్యవయవసహితమై, ఉండుట, పుట్టుట, వృద్ధిపొందుట, పరిణమించుట, క్షయించుట, నాశంబగుట, యనుషడ్భావవికారములుగలదై, సప్తధాతుమయమైకనబడెడిస్థూలశరీరమేఅన్నమయకోశము-యెందుచేకోశమని చెప్పబడియున్నది.

"యథాఖడ్గంతత్కోశం ఆమ్రఫలంత్వక్,
యథాతుషః తండులాదిక మాచ్ఛాదయతి,
యథావాగర్భం జరాయురావారయతి,
కోశవ దాచ్ఛాదకత్వాత్కోశ ఇత్యు
చ్యతే"

కత్తిని ఒరయును, చింతపండును చింతగుల్లయును, బియ్యమును పొట్టును, పిండమును మావియును, కప్పుకొనినట్లు పరమాత్మను కనబడనీయక, కప్పుకొనియున్నది గనుక కోశమని పేరుకలిగెను.

" ననుఖడ్గాదీనాం, తత్కోశాదీనాంచ, స
త్తాభిన్నా, పంచకోశా నామాత్మభిన్నస
త్తాకత్వాభావాత్, కోశాదిభ్యో, వైష
మ్యాత్కథమాచ్ఛాదకత్వమితిచేదుచ్యతే"

అయితే దృష్టాంతమందు, ఒరయును, కత్తి
యు మొదలగునవి వేరైన వగుటవలనను, స
మాన ధర్మములుగలది కానందునను, ఒకదాని
నొకటి ననుసరించి ప్రకాశించునవి కానందున
ను, ఆయొర మొదలైనవి ద్రవ్యములను మూసి
కొని యుండునట్టివగునుగాని, దార్ష్టాంతికమం
దు కోశములు తమ సత్తవలన ప్రకాశించునవి
గాక ఆత్మసత్త ననుసరించి జీవించి ప్రకాశిం
చుచుండు కోశములు పరమాత్మను కప్పునట్టి
శక్తియెట్లు కలిగినను శంకకు—సమాధానమిట్లు
చెప్పబడెను. అనగా-

" ఆదిత్య కిరణపరిణామ విశేషత్వాన్మే
ఘస్యాదిత్య సత్తైవ సత్తా తథాపి మేఘః
ఆదిత్యం యథాచ్ఛాదయతి- అగ్నిముపజీ
వ్య వర్తమానస్య ధూమస్యాప్యగ్నిసత్తై
వసత్తా తథాపిసధూమః అగ్నిమాచ్ఛాద

యతి - ఏవమాత్మ సత్తయాసత్తావంతోపి
కోశా ఆత్మానం ఆచ్ఛాదయంతి''
సూర్యుని కిరణమువలననే కలిగి అనూర్యుని
సత్తచేతనే ప్రబలుచు నుండెడు మేఘము-ఆది
త్యుని మరుగుపరచిన తీరునను, అగ్నిసత్తవలన
గలిగి అగ్నిసత్తవలననే సెగడుచున్న పొగ
అగ్నిని కప్పుచున్నట్లు - ఆత్మసత్త, ననుసరించి
వృద్ధినొందు కోశములు పరమాత్మను కప్పునట్టి
శక్తిగలవయ్యెను-అయితే అన్నమయకోశమునకు
ను పరమాత్మకును చేరికయెట్లు కలిగెను? అ
న్యోన్యాధ్యాసముచేత కలిగినది. అన్యోన్యాధ్యా
సమనగా - ఒకవస్తువునందలి గుణము మరియొక
వస్తువునందు తోచుట—అదెట్టులనిన - నేనుజీ
వుడననుట జీవాధ్యాసము - నేనుమనుష్యుడనను
ట జాత్యధ్యాసము- నేను పుట్టిపెరిగి యింతవా
డనై క్షీణించి మరణించుచున్నాననుట వికా
రాధ్యాసము - నేను పురుషుడను, స్త్రీని, నపుం
సకుడననుట చిన్హాధ్యాసము - నేను బ్రాహ్మణు
డను, క్షత్రియుడననుట వర్ణాధ్యాసము - నేను
ఆంధ్రుడను, వెలనాటిని, మహారాష్ట్రుడను, కా
శ్యపగోత్రిని, ఆశ్వలాయనసూత్రిననుట విశేషజా

త్యధ్యాసము - నేనుబ్రహ్మచారిని, సన్యాసిననుట ఆశ్రమాధ్యాసము - నేనురామయ్యననుట నామాధ్యాసము - నేను నల్లనివాడననుట రూపాధ్యాసము. నేను సోమయాజిని, వాజిపేయయాజిననుట సంస్కారాధ్యాసము - నేనుతత్వవాదిని, విశిష్టాద్వైతిని, పరమభాగవతుడను, శైవుడను, శాస్త్రజ్ఞుడను, యోగీశ్వరుడననుట వేషాధ్యాసము - నేను జ్ఞానిని, కుమ్మరిని, మంగలిని, చాకలిని, కరణముననుట క్రియాధ్యాసము - ఇవి మొదలైన అన్నమయకోశమందుగల లక్షణములు అవిషయమైనఆత్మయందును, ఆత్మయందుగల సచ్చిదానందలక్షణములు విషయమైనఅన్నమయకోశమందును, తోచుచున్నవి, గాన అన్నమయకోశమునకును పరమాత్మకును ఐకమత్యము వచ్చినది-అయితే యీ అన్నమయకోశము ఆత్మగానివిధంబెట్లు? ఈస్థూలశరీరము జన్మంబునకంటె పూర్వమందును, మరణంబునకంటె ఊర్ధ్వమందును, లేదు, గనుక వుత్పత్తివినాశాదిషడ్భావవికార, షట్కోశమయమైన అన్నమయకోశము ఆత్మగాదు-ఆత్మయని చెప్పినచో - యీశరీరము, యీ

[illegible] భోక్తృయగునందున, పూర్వము చేయబడని కర్మ జన్యసుఖదుఃఖఫలంబులను [illegible] యుభుడు అనుభవింపుచున్నాడ గాన [illegible] - ఇట్లు చెప్పుట అకృతాభ్యాగమ దోషంబగును. అనగా చేయకనే అనుభవించుటయను మరియు యీదేహము మరణించువాడగుచో [illegible] నందున, యీజన్మమందు చేయబడిన పుణ్యపాప మిశ్రకర్మఫలంబులు, అనుభవింపబడకనే క్షీణించి పోవలెను. ఇట్లంగీకరించిన పక్షమున, కృతప్రణాశ దోషము సంభవించును. అనగా చేసి అనుభవించక క్షీణించుదోషము, యీదోషముల నంగీకరించుట శాస్త్రజ్ఞులకు సమ్మతంబుగాదు, గనుక అన్నమయకోశంబు ఆత్మయనిచెప్పుట సరిగాదు—

ప్రాణమయకోశమనగా యెట్టిది ?

"కర్మేంద్రియై స్సహ ప్రాణమయకోశః"

"ప్రాణాదిపంచకం ప్రాణమయః కర్మేంద్రియైర్యుతమ్"

(శ్రు) "ప్రాణాది దశవాయవోన్నమయకోశే యదావర్తంతే తదా ప్రాణమయకోశః"

ఇత్యాది ప్రమాణముల రీతిని, వాక్కు, పాణి, పాదము, పాయువు, గుహ్యము, అనుక ర్మేంద్రియములయిదును-ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనెడు, ప్రాణములయిదును గూడి ప్రాణమయకోశము, మరియు ప్రాణ వాయువు మొదలగు దశవాయువులు అన్నమ యకోశములో, యెప్పుడు సంచరించుతవియో అప్పుడు ప్రాణమయకోశ మనబడును. ఈ ప్రాణమయకోశమునకును పరబ్రహ్మమునకును కూట మి యెటులగలిగినది. అన్యోన్యాధ్యాసము చేత కలిగినది - అది యెట్లనిన.

"అహంక్షుధాయుక్త,అహంపిపాసావాన్, అహంబలవాన్, అహంవీర్యవాన్, అ హంక్రియావాన్,అహంవక్తా,అహందాతా, మూకః,పంగుః, విహస్తః, షండః,ఇత్యాది ప్రాణవికారత్వే సతి, చక్షురాదిరహిత మాత్మానం వక్తారమివ, దానాదిరహిత మాత్మానం దాతారమివ, గమనాగమన శూన్యమాత్మానం గంతారమివ, క్షుత్పి పాసాదిరహితమాత్మానం క్షుత్పిపాసావం తమివ ఆహారయతి"

నేను ఆకలియును, దప్పియును, సామర్థ్యమును, బలమును, పరాక్రమమును, గలవాడను, వాచాలకుడను, దాతను, మూగను, కుంటిని, గ్రుడ్డిని, అనునివి మొదలైన ప్రాణమయకోశమందు గల గుణములు పరమాత్మయందును.

"ఆత్మనః సచ్చిదానందాన్ మమప్రాణాః అస్తి భాతి ప్రియమితి ప్రాణమయకోశేచాధ్యస్యతి"

అను రీతిని పరమాత్మయందుగల సచ్చిదానందాదిగుణములు, ప్రాణమయకోశమందు గలవిగాను, ప్రాణముగలవాడ నగుటచేత తోచుచున్నవి, గనుక, ప్రాణమయకోశమునకును పరమాత్మకును కూటమివచ్చినది. ఈప్రాణమయకోశంబే, ఆత్మయని చెప్పదామంటే-ఏదో ప్రాణాదివాయువులు, శరీరమునకంటె అంతరంబై నఖ శిఖ పర్యంతము వ్యాపించినదై, చక్షురాదీంద్రియంబులకు వ్యానరూపంబుచే బలంబిచ్చుచు, ఇంద్రియంబులం ప్రేరేపించునదియై యుండుచున్నదో ఆప్రాణమయకోశము ఘటాదికంబువలెనే జడస్వభావంబుగలది, దృశ్యంబు పరిచ్ఛిన్నమయినది గనుక ఇదియునుఆత్మగాడు.

మనోమయకోశమనగా యెట్టిది ?

"జ్ఞానేంద్రియై ర్మనోయుక్తం మనోమయః
ఇతీరితః"

"జ్ఞానేంద్రియాణిపంచ మనశ్చ ఏతత్సర్వం
మిళిత్వా, మనోమయకోశ ఇత్యుచ్యతే"

(శృ) "ఏతత్కోశద్వయ సంయుక్త ఆత్మా,
మన ఆది చతుర్దశకరణై శ్శబ్దాది విష
య సంకల్పాది ధర్మాన్యదాకరోతి తదా
మనోమయకోశః"

మనస్సు, శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, అనెడి జ్ఞానేంద్రియము లైదును జేరి మనోమయ కోశము, మరియు అన్నమయ ప్రాణమయ కోశములతో కూడిన ఆత్మ, మనస్సు మొదలైన పదునాలుగు కరణములతో శబ్దము మొదలగు విషయ సంకల్పాది ధర్మ ములను చేయునపుడు, మనోమయకోశమనబడును. ఈమనోమయ కోశమునకును పరమాత్మకును చేరికయెటువలెను - అన్యోన్యాధ్యాసము చేత కలిగెను. అదెట్లనిన.

“ అహం సంకల్పవానహం వికల్పవాన్
దుఃఖవాన్మోహవాన్కామీ లోభీ శ్రోతా
స్పృష్టా ద్రష్టా రసయితా ఘ్రాతా బధిరః
అంధః ఇత్యాది మనోవికారత్వే సతి సంశ
యాదిరహితమాత్మానం సంశయాదివంతం,
శోకమోహాదిరహితమాత్మానం శోకమోహా
దివంతం, దర్శనాదిరహిత మాత్మానందర్శ
నాదిమంతమావారయతి”

అనగా నేను సంకల్పమును వికల్పమును గలవాడను, దుఃఖిని, మోహిని, కామిని, క్రోధిని, ద్వేషిని, వినువాడను, పుట్టించువాడను, ఇచ్ఛగలవాడను, రసజ్ఞుడను, ఆఘ్రాణించువాడను, చెవిటివాడను, నాలుకలేనివాడను, ముక్కులేనివాడనను నివి మొదలగు మనోమయకోశ నిష్ఠములయిన సంకల్పాది ధర్మములు ఆత్మయందును,

“ ఆత్మధర్మాన్ సచ్చిదానందాంశ్చ మమ
మనః సమ్యగస్తి భాతి ప్రియమితి మనోమ
యకోశే అధ్యస్యతి”

ఆత్మధర్మము లయిన సచ్చిదానందనములు మనోమయకోశమందును, మనస్సుండుటచేత తోచు

చున్నవి. కాబట్టి మనోమయకోశమునకును ఆత్మకును కూటమి వచ్చినది. ఈమనోమయకోశంబే ఆత్మ అనుదామనిన-దేహంబునందు, నేననెడి అభిమానంబును, గృహారామ క్షేత్రాదులయందు, నాదియనెడి స్వభావంబును, గలుగజేయు యీ కోశంబు, ప్రాణమయకోశంబునకంటె నితరంబై, కామ క్రోధాది వ్యాపారంబునుగలిగి నియత స్వరూపంబులేక, దేహాదికంబువలె జడత్వ దృశ్యత్వ పరిచ్ఛిన్నత్వాది వికారములు గలది యైనందున ఇదిఆత్మకాదు.

విజ్ఞానమయ కోశమనగా నెట్టిది ?

" జ్ఞానేంద్రియాణిపంచ బుద్ధిః ఏతత్సర్వం
మిళిత్వావిజ్ఞానమయకోశ ఇత్యుచ్యతే"

" బుద్ధిజ్ఞానేం ద్రియైర్యుక్తం విజ్ఞానమయ
కోశకమ్"

(శ్రు) "ఏతత్తోక్చ్య త్రయ విశిష్టాంతః కరణే,
తద్గతవిశేషధ్యాన మననాది వృత్తయోయ
దోత్పద్యంతే తదావిజ్ఞాన మయకోశః"

బుద్ధియును జ్ఞానేంద్రియములైదును, గలసి విజ్ఞానమయకోశము-మరియు అన్నమయ ప్రాణ

మయ మనోమయ కోశములతో కూడినఅంతఃకర
ణమునందు, వాటిలో నుండు ధ్యాన మననాది వృ
త్తియెపుడుకలుగుచున్నదో అప్పుడువిజ్ఞానమయ
కోశమనబడును-యీ విజ్ఞానమయకోశమునకును
పరమాత్మకును కూటమియెటువలె వచ్చినది. అ
న్యోన్యాధ్యాసముచేత కలిగినది. అదియెట్లనగా?

"అహంకర్తా, బుద్ధిమాన్ ఊహాపోహచతు
రః । ఏకసంగ్రాహీ యో గాంతరగామీ
రాగద్వేషీ శ్రోత్రియః పండితః విరక్తః
భక్తిమాన్ ఉపాసకః జ్ఞానీత్యాది విజ్ఞాన
మయకోశవికారత్వేసతి, అకర్తారమాత్మా
నం కర్తారమివ అవిజ్ఞాతారమాత్మానం
విజ్ఞాతారమివ, నిశ్చయరహిత మాత్మానం
నిశ్చయవంతమివ, మాందజాడ్యాది రహి
తం జాడ్యాది మంతమివావారయతి"

నేను కర్తను, నిశ్చయముగలవాడను, బుద్ధిమం
తుడను, ఊహాపోహలలో చతురుడను, ఏకసంత
గ్రాహిని, శ్రోత్రియుండను, విరక్తుడను, పండితుడను,
లోకాంతరగంబునకు పోవువాడను, అనెడు విజ్ఞాన
మయకోశనిష్టములైనధర్మంబులు ఆత్మయందును,

" ఆత్మలక్షణ సచ్చిదానందాః మమబు
ద్ధిరస్తి భాతిప్రియమితి విజ్ఞానమయ కో
శేచాధ్యస్యతి ఏవం విజ్ఞానమయకోశస్యా
త్మనశ్చాన్యోన్యాధ్యాసః"

ఆత్మధర్మములైన సచ్చిదానందములు మనోమయకోశమందును, మనస్సుండుటచేత తోంచుచున్నవి, కాబట్టి మనోమయకోశమునకును, ఆత్మకును అధ్యాసద్వారా కూటమివచ్చినది-ఈవిజ్ఞానమయకోశంబే ఆత్మ యనందగదా? మనోమయకోశంబునకంటె అంతరంబగు కర్తృశబ్ద వాచ్యంబైన విజ్ఞానమయకోశంబనెడి చిదాభాసునితో కూడియుండుబుద్ధి, సుషుప్తికాలంబునందు తనకు గారణంబగు అజ్ఞానంబునందు లీనంబగుచు, జాగరణకాలమందు నఖపర్యంతము వ్యాపించి విలయాద్యవస్థలనుగలిగి దృశ్యంబై యున్నందున, ఇదియును ఆత్మ కాదు.

ఆనందమయకోశమనగా యెట్టిది?

" ప్రియమోద ప్రమోదవృత్తి మదజ్ఞానప్ర
ధానమంతః కరణం ఆనందమయ కోశ
ఇత్యుచ్యతే"

"ప్రియాది యుక్తమజ్ఞానమానందమయ ఉచ్యతే"

(శృ) "ఏతత్కోశ చతుష్టయకారణా జ్ఞాన సంపృక్తం స్వకారణజ్ఞానం స్వరూపసుఖే వట దానాసువటవృక్ష ఇవయదావర్తతే తదానందమయ కోశః"

ప్రియము మోదము ప్రమోదము అనెడి వృత్తులతోగూడి అజ్ఞానమే ప్రధానముగాగల అంతః కరణమే ఆనందమయకోశము-ప్రియమనగా ఇష్టమైన పదార్థమునుకనిన మాత్రముననేకలిగెడి సంతోషము ప్రియము-ఆపదార్థము తనచేతికి వచ్చినపిమ్మట గలిగెడి సంతోషము మోదము-ఆచేతికివచ్చినవస్తువును అనుభవించినతోడనే కలిగినసంతోషము ప్రమోదము - యీకోశమునకు మూడవ శృతిప్రకారము అర్థమేమనగా అజ్ఞానముతో కూడి పైన ఉదహరించిన నాలుగు కోశములతో కూడియుండు నపుడు మఱ్ఱివిత్తనమున మఱ్ఱిచెట్టుఅణగియుండురీతిని స్వరూప సుఖమునందు తనకారణజ్ఞానము అణగియుండు నపుడు ఆనందమయకోశమనబడును. ఈ ఆనందమయకోశమునకును పరమాత్మకునుకూటమియై

టుల వచ్చినది-అన్యోన్యాధ్యాసచేత వచ్చినది. అదియెట్లనిన-

" అహంభోక్తా సుఖీసంతుష్టః -సాత్వికః రాజసస్తామసః మూఢః దుష్టః శూన్యః మోహితఃఅవివేకీ భ్రాంతఇత్యానందమయ కోశవికారత్వేసతి ప్రియమోద ప్రమోద రహితమాత్మానంప్రియమోద ప్రమోదమంతమివ- అభోక్తారమాత్మానం భోక్తారమివ-పరిచ్ఛిన్నసుఖ రహితమాత్మానం పరిచ్ఛిన్నసుఖవంత మివాచ్ఛాదయతి"

అనగా నేను భోక్తను సంతుష్టుడను సుఖిని, రాజసుడను సాత్వికుడను తామసుడను మూఢుడను శక్తుడను భ్రాంతుడను అనునివి మొదలైన ఆనందమయకోశ ధర్మాంబులుఆత్మయందును-

" ఆత్మనః సచ్చిదానందాంశ్చ మమజ్ఞానమస్తి భాతిప్రియమితి ఆనందమయకోశే అధ్యస్యతి"

అనురీతిని సచ్చిదానందములు ఆనందమయకోశమందును, ఆనంద ముండుటవలన తోచుచున్నవి కాబట్టి, ఆనందమయ కోశమునకును

పరమాత్మకును కూటమిఁవచ్చినది - అయితే యీ యానందమయ కోశంబు ఆత్మగానివిధం బెట్లు- ఈభోక్తయగు ఆనందమయకోశంబును, ఘటాదులవలెదృశ్యంబు జడంబు పరిచ్ఛిన్నంబు గనుక,

(శృ)"అస్థూలమనణ్వ హ్రస్వమ దీర్ఘమ శబ్ద
మస్పర్శమరూప మవ్యయమ్"

అను ఇత్యాదిలక్షణమైన ఆత్మకానేరదు. అయితే పరమాత్మకు పంచకోశ వ్యతిరిక్తత్వము యెటులసిద్ధించును ! కత్తిఁవొరమొదలైనవి భేదము లేక ఒకటిగానే వ్యవహరింప బడుచు, ఒకటిగానేతోచినను, విచారింపగా, కత్తియును ఒరయును వేరైనటుల వేదాంతశాస్త్రవిచారణచేత, పరమాత్మ త్రికాలములయందును పంచకోశంబులకంటె వేరై తోచుటవలన, పంచకోశవ్యతిరిక్తత్వము లభించును-ఇందుకుదృష్టాంతమెట్లనిన.

" మమగోయంగౌః మమచాయంవత్సః మమాయంకుమారఃమమాయంకుమారీ మమాయంస్త్రీ) ఏవమాది పదార్థవాన్ పురుషః పదార్థోన భవతి-తేభ్యోయథా విలక్షణః తథామమ అన్నమయకోశః మమప్రాణ

మయకోశః మమ మనోమయకోశః, మమ
విజ్ఞానమయకోశః మమానందమయకోశః
ఏవంపంచకోశవాణ్ ఆత్మా పంచకోశాది
ర్నభవతి- తేభ్యోవిలక్షణః”

అనగా నాయావు నాదూడ నాపుత్రుడునా
కూతురు నా భార్య అని తన్ను అనుసరించుకొని
తోచెడి ఆవు దూడపుత్రుడు మొదలగునవి తాను
గానట్లు, దార్ష్టాంతికమందును, నాశరీరము నా
ప్రాణము నామనస్సు నాబుద్ధి అని తన్ను సంబం
ధించుకొని తోచెడు పంచకోశములును తాను
కానందున, ఘటద్రష్ట ఘటభిన్నుండెటువలెనో,
అటువలె పంచకోశంబులకంటె తాను విలక్షణు
డని యెరుగవచ్చును - మరియు ఆవుబలిసినది
దూడచిక్కినది కుమారుడు చెప్పినట్లువినడు,
దుష్టుడు, కూతురు మహామూఢురాలై యున్నది
అనెడు పశువు మొదలగు వానియందలి వికార
ములును విషయములును తన్నంటనియట్లున్ను,
మరియు

“ జలగత సూర్య ప్రతిబింబంజలవృద్ధౌ వ
ర్ధతే, జలహ్రాసేహ్రసతి, జలచలనేచలతి, జ
లభేదేభిద్యత, ఇత్యేవం జలధర్మాను విధా

యిభవతి, నతు పరమార్థతః సూర్యస్యతత్వ
మస్తి, ఏవం పరమార్థతో వికృతమేకరూప
మపి, సద్బ్రహ్మదేహాద్యు పాధ్యన్తర భావా
త్ భజత ఏవోపాధిమాన్ వృద్ధిహ్రాసాదీని''

అనగా జలములో ప్రతిఫలించు సూర్యబింబము, వుదకము వృద్ధికాగా వృద్ధిపొందుచున్నది - జలముతగ్గగా తగ్గిపోవుచున్నది - జలము చలింపగా చలించుచున్నది - నీళ్లు భిన్నముకాగా భిన్నమగుచున్నది - యిట్లు నీటిధర్మము ననుసరించితోచుచున్నదేగాని యథార్థముగ ఆదిత్యునకు ఆధర్మములుయెట్లు నిజముకావో, ఆ, ఆదిత్యుని యెట్లుస్పృశింపవో అట్లు గాష్టాంతికమందు అన్నమయకోశ నిష్టమైనజీవత్వ మనుష్యత్వాది ధర్మములున్ను, ప్రాణమయకోశ నిష్టమైన క్షుత్పిపాసాదిగుణములున్ను, మనోమయకోశనిష్టమైనసంకల్పాది ధర్మములున్ను, విజ్ఞానమయకోశ నిష్టమైన కర్తృత్వాదిగుణములున్ను, ఆనందమయకోశ నిష్టమైన భోక్తృత్వాది వికారములున్ను - యథార్థముగా వికారములేక ఏకరూపమైన, ఇట్టిఉపాధుల యొక్క [illegible]తరమంచుండుటవలన ఉపాధికలిగినట్లు తోచునేగాని యథార్థముగాలేని సద్రూ

పుడును, పంచకోశవ్యతిరిక్తుడును, సాక్షియునైన, తన్ను కాలత్రయమందును స్పృశింపలేవు, కాబట్టి యిట్లువిచారించి యెరుగుటయే పంచకోశవ్యతిరిక్తజ్ఞానము-ఇట్టిజ్ఞానమెట్లురావచ్చుననిన-

"బాహ్యా దృష్టిర్నేత్రేంద్రియంఅంతర్దృష్టిర్బుద్ధిః
బాహ్యదృష్ట్యా జ్ఞాతుమశక్యా అపిపదా
ర్థాః అంతరదృష్ట్యా జ్ఞాతుంశక్యంతే"

అధ్యయనకాలమందు అధ్యయనము చేసే పురుషులచేత ఉచ్చరింపబడిన శబ్దంబులను పంచుటకు వశముగాకున్నప్పటికిన్ని, శ్రోత్రేంద్రియము చేతవిని, విమర్శించ శక్తిగలబుద్ధిచేత ఇది వీనిశబ్దము ఇది వీనిశబ్దముఅనియెరిగినట్టులను, జలమందు గల వేడిమిని వేరుపరచుటకు గాకపోయినను త్వగింద్రియము చేస్పృశించివివేకముగల బుద్ధిచేత జలంబును ఉష్ణమును ప్రత్యేకించి యెరిగినచందమునను, గోడయందువ్రాయబడిన చిత్తరువులోని వర్ణములను, పొట్టి పొడుగుగా నుండెడి రూపంబులను విభజించుటకు అలవిగాకపోయినను చక్షురింద్రియముచేత చూచి వివేకసహితమైన బుద్ధిచేత ఆవర్ణములను తెలిసికొనిన చందమునను - నీటిలోగలసిన పదార్థములను విభాగింపశక్యముగాకు

న్నను రసనేంద్రియముచేత అనుభవించి వివేక యుక్తమైన బుద్ధిచేత అపద్రసంబులను ప్రత్యేకం బుగ యెరిగినవిధమునను - స్రగ్ముల నాశ్ర యించియున్న పరిమళములను వేరుపరచ శక్య ము గాకయున్నను ఘ్రాణేంద్రియముచేత ఆఘ్రా ణించి వివేకశీలమైనబుద్ధిచేతఇదిసుగంధము, ఇది దుర్గంధము ఇది మిశ్రగంధము అని తెలిసికొనిన తీరున, దార్ష్టాంతికమందు, పంచకోశంబులను వానితో గూడియున్న ఆత్మను పంచుటకు అశ క్యమైనను, వివేకయుక్తంబగు బుద్ధిచేత పంచకో శంబులు, మహాభూతంబులయొక్క కార్యంబులు దృశ్యములు, జడంబులు, పరిచ్ఛిన్నములు అని వాటియొక్క స్వరూపములనున్ను, ఆత్మనిత్యు డు, నిర్వికారుడు శుద్ధుడు సర్వసంబంధశూన్యు డు సత్యుడు కాలత్రయాబాధ్యుడు సాక్షి,అను ఇట్టిస్వరూపమును విచారించి

" సాధనాంతరనిరపేక్షయాస్వయం ప్రకా శమానంవస్తు, అప్రకాశమానంవస్తునభ వతి, అప్రకాశమానంవస్తు సాధనాంతర నిరపేక్ష యాస్వయం ప్రకాశమానంవస్తు నభవతి - దుఃఖరూపంవస్తు సుఖరూపం

వస్తునభవతి - సుఖరూపంవస్తు దుఃఖరూ
పంవస్తునభవతి''

మరియు,

'' పంచకోశాది యోగేన తత్తన్మయ తయా
స్థితః శుద్ధాత్మా నీలవస్త్రాదియోగే నస్ఫటి
కోయథా''

అనురీతిని పంచకోశములతో ఆత్మకు కాలత్రయ
మందును సంబంధము లేదని యెరుగవచ్చును-
త్రాడు, యెండమావులు మొదలగువానియందు
ఆరోపింపబడిన సర్పము,జలము- త్రాడు మొద
లగువానికంటె వేరుగలేనట్లు, అనగా స్వవిచార
ణంబువలన నిర్జలప్రదేశమందు భ్రాంతివలన కన
బడెడు జలంబు ఆనిర్జలప్రదేశము మాత్రమే యె
ట్లగుచున్నదో అట్లును, త్రాటియందు భ్రాంతివలన
కనబడెడు సర్పము ఆత్రాడు మాత్రమే యెట్లగు
చున్నదో అట్లు, పరమాత్మయందు ఆరోపింపబడి
నపంచకోశములును పరమాత్మకంటె అన్యముగ
లేవు- ఈదృష్టాంతమందు త్రాడు యెండమావు
లు అనెడు జ్ఞానము కలిగినతర్వాత సర్పము జల
మనెడు భ్రమలేనియట్లు దార్ష్టాంతికమందును

ఆత్మవిషైక జ్ఞానముకలిగినపిమ్మట పంచకోశముల నేడు వ్యవహారము విడువకవచ్చుచున్నది, గనుక ఆరోపితములైన పంచకోశములును అధిష్ఠానమై నఆత్మకంటె వ్యతిరిక్తముగ లేవని బుద్ధియందు ఏవిధమున దృఢముకలుగును? యెండమావులనుజూచి నీరనిభ్రమసి త్రాగతలచినవాడు విచారించి యివి జలములుగావుయెండమావులు అనుజ్ఞానము వచ్చినను యెండమావులనుజూచినపుడు జలముగాతోచుచున్నట్లుగానే, పరమాత్మయందు తోచిన పంచకోశములు పరమాత్మకంటె వేరుగాలేవని యెరిగినను తిరుగ పంచకోశముల ప్రతీతిరావచ్చును - ఇచ్చట దృష్టాంతమైన యెండమావులయందు జలప్రతీతి మాత్రమేగాని స్నానపానాదులు చేయవలయునను భ్రమకానము - దార్ష్టాంతికమందు ఆత్మకంటె వేరుగా పంచకోశములు లేవని యెరిగిన తర్వాతను పంచకోశముల ప్రతీతియును వాని వ్యవహారములును వచ్చుచున్నవే, రావచ్చునా? రావచ్చును - మృత్తికయందు ఆరోపింపబడిన కుండలు మూకుళ్లు మొదలైనవి మృత్తుకంటె వేరుగలేవని తెలిసినను-ఆకుండలులోనగువానిప్రతీతియు వ్యవహారమును వచ్చి

నతీరున ఆత్మయందారోపింపబడిన పంచకోశము
లును అధిష్టానమైన ఆత్మకంటె అన్యముగాలేక
నియుఁరిగినను పంచకోశములనెడు ప్రతీతియును
వ్యవహారమును రావచ్చును - ఈదృష్టాంతమందు
కుండలు మొదలుగునవి కనబడుచు వ్యవహారము
నకు వచ్చినను సూక్ష్మబుద్ధిగలవానికి మట్టికంటె
వేరుగ కుండలులోనైనవి లేవని మనస్సునందు
స్థిరమైనతీరునను-సముద్రమందుండు నీటిబుగ్గలను
తత్కారణంబగు వుదకముగా చూచినట్లును
దార్ష్టాంతికమందు పంచకోశములు తోచుచు
వ్యవహారమునకు వచ్చినను సూక్ష్మబుద్ధిగలవానికి
పరబ్రహ్మముకంటె వ్యతిరిక్తముగ పంచకోశములు
లేవని బుద్ధియందు దృఢము కలుగవచ్చును - ఈ
విచారణకు ఫలమేమనిన ఆత్మ అవస్థాత్రయము
నందు అనుస్యూతుడైయున్నాడనిన్ని, పంచకో
శములు అవస్థాత్రయమునందు అనుస్యూతములై
యుండలేదు కాబట్టి పంచకోశములు తోచుచు
వ్యవహారమునకు వచ్చినను- "పురుషఏవేదంవి
శ్వం"= ఈసమస్తమున్ను పరమాత్ముడే. "యస్మా
త్పరంనా పరమస్తి కించిత్ తేనేదంపూర్ణంపురు
షేణసర్వం" = ఏనాశనరహితుడగు పరబ్రహ్మ

మునకంటె వుత్కృష్టమైనదిన్ని ఇతరమైనదిన్ని కొంచెమైనను లేదో అట్టిపరిపూర్ణుడగు పరబ్రహ్మ ముచేత ఈసమస్తమున్నునిండియున్నది. అనగా బ్రహ్మేతరములేదు. "బ్రంహ్మైవేద మమృతం పుర స్తాద్బ్రహ్మపశ్చాద్బ్రహ్మదక్షిణ తశ్చోత్తరేణ, అ ధశ్చోర్ధ్వంచప్రస్సృతం బ్రంహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్"=ఈసమస్తమునశింపని పరమాత్మయే ముందు, వెనక దక్షిణభాగమునను ఉత్తరభాగము నను క్రింద మీదు అంతటాఉండునది పరబ్రహ్మ మేఈసమస్తప్రపంచము పరబ్రహ్మమే. (ముణ్డకోపనిషత్.) "నేహనా నాస్తికించన" = ఈ పరబ్రహ్మస్వరూపమందు కొంచెమైనను భేదము లేదు. "పురుషాన్న పరంకించిత్" = పరిపూర్ణ మైన పరమాత్మకంటె వేరుగ కొంచెమైనను లేదు. (కఠోపనిషత్.) "పురుషఏవేదగ్ంస ర్వం యద్భూతంయచ్చభవ్యమ్" = భూతభవి ష్యత్ప్రపంచము, ఈసమస్త జగత్తుపరిపూర్ణుడగు పరమాత్మస్వరూపమే. "తదేవాగ్నిస్తదాదిత్య స్తద్వాయుస్తదుచంద్రమాః తదేవశుక్రం తద్బ్రహ్మ తదాపస్తత్ప్రజాపతిః" = అగ్ని సూర్యుడు వా యువుచంద్రుడు జలము పరిశుద్ధమును బ్రహ్మము

న్న, ఆపరమాత్మయే. "భోక్తాభోగ్యం ప్రేరితారం చమత్వా సర్వంప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్"= మూడువిధములుగా చెప్పబడియుండు, జీవభోగేశ్వరులు పరబ్రహ్మమే. (శ్వేతాశ్వతరోపనిషత్.) "సయథాసైన్ధవ ఘనోన న్తరోబాహ్యః కృత్స్నో రసఘనఏవైవంవా అరే౽యమాత్మా౽నన్తరోబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘనఏవేతి" = సముద్రసంబంధమైన వుదకముయొక్క ఉప్పుగడ్డ, వేరుగాక, సర్వము నీళ్లయొక్క ఘనీభావమెట్లో, ఆప్రకారమే ఈపరమాత్మస్వరూపము, లోపలవెలుపల, లేనిదై, సమస్తముప్రజ్ఞానముయొక్క ఘనీభావము, అనగా విజ్ఞానముకంటె వేరులేదు. "అయమాత్మాహిబ్రహ్మైవ, సర్వాత్మకతయాస్థితం" = ఈఆత్మస్వరూపమైన పరబ్రహ్మమే, సమస్త ప్రపంచ రూపత్వముచేత నున్నది. అనగా ఈసమస్త ప్రపంచము, బ్రహ్మేతరముకాదు. "నతు తద్ద్వితీయమస్తి, తతోన్యద్విభక్తం" = ఆపరమాత్మకంటె రెండవ వస్తువలేదు, దానికంటె అన్యముగ విభక్తమైన వస్తువలేదు. "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేనకంపశ్యేత్" = జ్ఞానాను

భవ కాలమందుజగంబంతయు సుఖస్వరూపం బగుచున్నది. అనగాపరబ్రహ్మస్వరూపమే యగుచున్నది. (బృహదారణ్యకోపనిషత్.) "సఏషబ్రహ్మఏషఇన్ద్రఏషప్రజాపతిరేతేసర్వేదేవాఇమానిచ పఞ్చమహాభూతానిపృథివీ వాయురాకాశ ఆపోజ్యోతీంషీత్యేతానీమాని చక్షుద్రమిశ్రాణీవబీజానీతరాణీ చేతరాణి చాణ్డజానిచ జారుజానిచస్వేదజానిచోద్భిజ్జానిచాశ్వాగావః పురుషాహస్తినోయత్కిఞ్చేదంప్రాణిజఙ్గమంచపతత్రిచ యచ్చస్థావరం సర్వంతత్" = హిరణ్యగర్భుడు, ఇన్ద్రుడు, ప్రజాపతి, దేవతలు, పృథివ్యాదిపంచమహాభూతములు, మనుష్యులు, పశువులు, దోమలు, వృక్షములు, గుల్మములు, గోవులు, ఏనుగులుమొదలయినవి, ఈ ప్రజ్ఞానరూపమైన పరమాత్మయే. (ఐతరేయోపనిషత్.) "ఓమిత్యేతదక్షరమిదగ్ం సర్వం" = ఈసమస్తమునాశనరహితమగు ఓంకారమేను, అనగా పరబ్రహ్మస్వరూపము. (మాండూక్యోపనిషత్.) "యచ్చకించిజ్జగత్యస్మిన్ దృశ్యతేశ్రూయతేపివా, అన్తర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః" = ఈ జగత్తునందు, చూడబడునదియు, వినబడునదియునగు సమస్తమునందును, లోపలను

వెలుపలను, నారాయణుడే వ్యాపించియున్నాడు. "సర్వోవై రుద్రః"=సమస్తము రుద్రస్వరూపము. "సర్వమిదం ప్రోతం పృథివీచాన్తరిక్షంచ ద్యౌశ్చదిశశ్చా వాన్తరదిశాశ్చసవై సర్వమిదం జగత్ సచభూతంసచభవ్యం"=ఏపరబ్రహ్మముచేత ఈజగత్తును, భూమియును, ఆకాశమును, స్వర్గమును, దిక్కులును మూలలును సర్వము, గ్రుచ్చబడియున్నదో ఆపరబ్రహ్మమే ఈకనబడెడిదియు, భూత భవిష్యత్తైన జగత్తగుచున్నాడు. "హగ్ సశ్శుచిషద్వసురంతరిక్ష సద్ధోతావేదిషదతిథిర్దురోణసత్, నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జాగోజా ఋతజాఅద్రిజాఋతంబృహత్"=ఆదిత్యుడును, ఆకాశము నందుండెడి వాయువును, యజ్ఞవేదికయందలి అగ్నియును, గృహములకు వచ్చియుండెడి అతిథియును, మనుష్యుల దేవతల శరీరములయందున్న ఆత్మస్వరూపమును, కర్మఫలభూతమైన స్వర్గాదిలోకములయందుండు వాడును, ఉదకములయందును, భూమియందును, స్వర్గమందును, పర్వతములయందును, జన్మించియుండెడి అన్నియును పరబ్రహ్మమే. (తైత్తిరీయోపనిషత్.) "సర్వంఖల్విదంబ్రహ్మ"=సమస్తముబ

హ్మస్వరూపము. "ఇదంస్సర్వం యదయమాత్మా, ఆత్మైవేదంసర్వం" = ఈ ప్రపంచమంతయు, ఆత్మస్వరూపమే. ఆత్మస్వరూపమేయీసమస్తము. (ఛాందోగ్యోపనిషత్.) "ఆత్మనోన్యస్తుపనాస్తిసర్వమాత్మమయం జగత్" = ఆత్మకంటె వేరుగా పొట్టంతమాత్రము లేదు, సమస్తజగత్తుఆత్మమయమైనది. "బ్రహ్మణోన్యత్తృణనాస్తి బ్రహ్మణోన్యత్పదంనహి" = బ్రహ్మముకంటె అన్యముగ తృణము లేదు, బ్రహ్మముకంటె, అర్థవంతమగు శబ్దము లేదు. "సర్వంబ్రహ్మైవ సతతగ్ సర్వంబ్రహ్మైవ కేవలం" = సమస్తము యెల్లప్పుడు పరబ్రహ్మస్వరూపము. "అసచ్చ సచ్చచిన్మాత్ర మాద్యంతం చిన్మయగ్ సదా" = చేతనరూపముకానిఅనగా, రజ్జుసర్పాది భ్రమరూపమైన అమూర్తస్వరూపమును, వ్యవహారమునందలి వస్తువుల సత్యస్వరూపమునగు, మూర్తద్రవ్యమును, చిత్స్వరూపము, "బ్రహ్మమాత్రమిదగ్ సర్వం బ్రహ్మణోన్యన్నకించన" = యీసమస్తము పరబ్రహ్మస్వరూపము, ఆబ్రహ్మముకంటె కొంచెమైనను వేరులేదు. "బ్రహ్మణోన్యేతరంనాస్తి బ్రహ్మణోన్యజ్జగన్నచ" = బ్రహ్మ

మకంటె అన్యతరములేదు. బ్రహ్మముకంటె వేరుగ, జగత్తులేదు. "బ్రహ్మమాత్రమిదగ్ సర్వం బ్రహ్మమాత్రమసన్నహి" = యీసమస్తము బ్రహ్మమాత్రము, సర్వము పరబ్రహ్మస్వరూపము. అసద్రూపము అనగా నామరూపాత్మక దృశ్యములులేవు. "ఆత్మరూపమిదగ్ సర్వంఆత్మనోన్యన్నకించన"=యీసమస్తము పరమాత్మస్వరూపము-పరమాత్మకంటె అన్యముగకొంచమైనను లేదు. "బ్రహ్మమాత్రమిదంసర్వం"=ఈసమస్తము పరబ్రహ్మస్వరూపము. "సర్వంచిన్మాత్రమేవహి" = ఈసమస్తము చిన్మయము. "బ్రహ్మైవసర్వం చిన్మాత్రం బ్రహ్మమాత్రం జగత్త్రయం"=ఈసమస్తము చిన్మాత్రస్వరూపమైన పరబ్రహ్మము,జగత్త్రయము బ్రహ్మమే. "సర్వంబ్రహ్మేతివిజ్ఞానాత్" = దృశ్యాదృశ్యంబగు ఈసమస్తమున్ను బ్రహ్మమని తెలుసుకొనుము. (తేజోబిందోపనిషత్.) "మద్వ్యతిరిక్త మణుమాత్రం నవిద్యతే" = నాకంటె వేరుగ అణుమాత్రమైనను లేదు. "మూర్తామూర్తేచ నారాయణఃకారణాత్మకగ్ సర్వంకార్యాత్మకగ్ సకలంనారాయణః"=సమస్త

మూర్తా మూర్తములు, కారణకార్యములు, నారాయణ స్వరూపము. (మహానారాయణోపనిషత్.) "నారాయణఏవేదగ్ సర్వంయద్భూతం యచ్చభవ్యం"= ఈసమస్తభూత భవిష్యత్ప్రపంచము నారాయణస్వరూపము. (నారాయణోపనిషత్.) "చైతన్యంవినాకించిత్ నాస్తీతి"= తేజోరూపమగు ఆత్మకంటే, వేరుకొంచెమైనను లేదు. (నిరాలంబోపనిషత్.) "బ్రహ్మణస్సర్వ భూతాని జాయన్తేపరమాత్మనః, తస్మాదేతాని బ్రహ్మైవభవంతీతి విచిన్తయ"=పరమాత్మ స్వరూపమగు పరబ్రహ్మమువలన, సమస్తభూతోత్పత్తి కలుగుచున్నది, గనుక సమస్తభూతభౌతికాదులు పరబ్రహ్మస్వరూపమే, అన్యముగలేదు. "ఉపాదానంప్రపంచస్య బ్రహ్మణోన్యన్నవిద్యతే, తస్మాత్సర్వ ప్రపంచోయంబ్రహ్మైవాస్తిన చేతరేత్" = "ప్రకర్షేణపంచధాభూజలాగ్ని వాయ్వాకాశ రూపేణ,విభజ్య[illegible]ప్రపంచః" =అను ప్రపంచశబ్దోత్పత్తినిబట్టి ప్రసిద్ధముగ పంచమహాభూతమ్ములుగ, విభాగింపబడు ప్రపంచమునకు నిమిత్త కారణము బ్రహ్మము, గాన, కార్యరూపమైన

సమస్తప్రపంచము కారణమగు పరబ్రహ్మమునకం టె వేరుగలేదు. "యథాతరఙ్గకల్లోలై ర్జలమేవం స్ఫురత్యలమ్, ఘటనామ్నా యథా పృథ్వీపటనామ్నాహితన్తవః, జగన్నామ్నా చిదాభాతిసర్వం బ్రహ్మైవ కేవలమ్"= యెట్లు జలమే వాయ్వాదుల సంబంధనుచేత, అలలు మొదలగునవిగాను, మృత్తు, ఘటమనునామధేయముచేతను, నూలు, వస్త్రమనునామధేయముచేతను, ప్రకాశించుచున్నవో, ఆప్రకారముచిత్స్వరూపమగుపరమాత్మ, జగత్తుగాప్రకాశించుచున్నాడుగాన, సమస్తప్రపంచము పరబ్రహ్మమేను. (యోగశిఖోపనిషత్.) "చిదహమ్ స్తేతిచిన్మాత్రమిదం చిన్మయమేవచ" = చిత్తేయిక్కడ వున్నది, ఈఘటపటాదికార్యాదులంతయు, చిన్మాత్రంబేను. "అస్తీత్యుక్తే జగత్సర్వం సద్రూపంబ్రహ్మతద్భవేత్" = ఉన్నదియనెడు సచ్ఛబ్దార్థంబును, ఆశ్రయించిలోచెడు సమస్తప్రపంచము,పరబ్రహ్మమే యగును. (వరాహోపనిషత్.) "చిదేవదేహోప్యసఃశ్చిదేవమనశ్చిదేవాపిచధీశ్చిదేవ, చిదేవకర్తాచ చిదేవభోక్తాచిదేవ భోగ్యంచచిదేవసర్వం, చిదేవపంచభూతానిచిదేవభువనత్రయం, చిదేవాహం చిదేవ

త్వంసర్వమేతచ్చిదేవహి'' = దేహము, మనస్సు, వాక్కు, కర్త, భోక్త, భోగ్యం, పంచమహాభూతములు, త్రిభువనములు, నేను, నీవు, సమస్తము, చిత్తు. "చిదేవ దేహశ్చిదిమేచలోకాః చిదేవభూతాని చిదింద్రియాణి, కర్తాచిదంతఃకరణంచిదేవ, చిదేవ స్సర్వంపరమార్థరూపం'' = దేహము, లోకాదులు, భూతములు, ఇంద్రియములు, కర్త, అంతఃకరణము, చిత్తే, సమస్తము, యథార్థముగ చిత్తేను. "వాసుదేవస్సర్వమిదం సర్వంవిష్ణుమయంజగత్, బ్రహ్మమాత్రమిదంసర్వంబ్రహ్మైవ సకలంజగత్'' = యీసమస్తమువాసుదేవస్వరూపము, సమస్తజగత్తు, విష్ణుస్వరూపము, యీసమస్తముబ్రహ్మమేను. (మహావాక్యదర్పణమ్.) "హరిమయమువిశ్వమంతయు, హరివిశ్వమయుండు సంశయముపనిలేదా హరిమయముగాని ద్రవ్యము, పరమాణువులేదు వంశపావనవింటే'' (శ్రీమద్భాగవతము.) "దృశ్యతే శ్రూయతేయద్య ద్బ్రహ్మణోన్యం నతద్భవేత్, తత్వజ్ఞానాచ్చ తద్బ్రహ్మ సచ్చిదానందమద్వయమ్'' = నేత్రములచేత చూడబడునది, చెవులచేత వినబడునది, మనస్సుచేత స్మరించబడునది, వాక్కుచేతచెప్పబడునది, సమస్తమున్ను,

చక్రగావిమర్శించిన పక్షమందు, జ్ఞానాకార
మేఅయివున్నది, గాన, అద్వితీయసచ్చిదానంద
స్వరూపమేకాని, దానికి వ్యతిరిక్తమైనది ఈషు
త్పదార్థమైననులేదు. "బ్రహ్మాన్యద్భాతిచేన్మిథ్యా
యథామరుమరీచికః" = పరబ్రహ్మమునకంటె అ
న్యముగతోచెనేని, అతోచునది యెండమావులవ
లె అబద్ధము. (ఆత్మబోధము.) "మత్తఃపర
తరం నాన్యత్కించిదస్తిధనంజయః" = ఓయి
ధనంజయనాకంటె అన్యమైనది కొంచమైనను
లేదు. "నతదస్తి వినాయత్స్యా న్మయాభూతం
చరాచరమ్" = నేనుగాని చరాచరభూతములు
లేనేలేవు. (భగవద్గీత.) "పురుషః పరమాత్మాతు
యదతోన్యదసచ్చతత్" = పరిపూర్ణుడగుపు
రుషుడే పరబ్రహ్మముదానికి అన్యమైనదంతయు
లేనిది. ఇచ్చట పరిపూర్ణత్వముచేత ఆత్మకు
త్రివిధకృతపరిచ్ఛేద శూన్యత్వముసిద్ధించుతున్నది-
యెట్లనిన? "భూతభౌతికభావేషు స్వకార్యే
షుసదాత్మనా వ్యాపీదృష్టస్తతో హ్యాత్మాదేశా
న్నాన్యపరిచ్ఛితిః" = పంచమహాభూతములును,
వానికార్యములతోగూడిన సమస్తజగంబునందు
ను, ఆత్మకు అనువృత్తికలిగియున్నందునను, వ్యా

పకత్వముకలిగియున్నందునను, దేశముచేత పరిచ్ఛిన్నత్వములేదు. "అదేహిత్వాదనాదిత్వాదబాధ్యత్వాన్నవిద్యతే, వర్తమానాగతాగామికాలేభ్యోప్యపరిచ్ఛిత్తిః" = ఆత్మ అనాదిగనుక భూతకాలముచేతను, నిత్యుడుగనుక భవిష్యత్కాలముచేతను, దేహవ్యతిరిక్తుడుగాన వర్తమానకాలముచేతను, పరిచ్ఛిన్నత్వములేదు. "సర్వాభిన్నస్వరూపేణ సర్వాత్మత్వాత్స్వాత్మనః, సర్వేభ్యోవస్తుజాతేభ్యఃపరిచ్ఛిత్తిర్నవిద్యతే" = ఆత్మ సర్వాత్మకుడైయుండుటవలనను, ఆసద్రూపుడైన ఆత్మ ఆకాశాదులు కానివానివలె కనబడినను, ఆయాకాశాదులు, అనగా, పంచీకృత, అపంచీకృత భూతములు వాటివలనగలిగిన చతుర్విధభూతగ్రామాదులు, స్థావరములు, మొదలగునవి పరమాత్మస్వరూపమైనసత్తును, ఉపజీవించుకొనియున్నవిగాన, మృత్తికయందుదోచెడి ఘటాదులు, స్వర్ణంబుయందుదోచెడి కటకమకుటాదులు, ఆ మృత్తిక, స్వర్ణమునకంటె, యేప్రకారము పరిచ్ఛిన్నముగావో, ఆరీతిని, పరబ్రహ్మస్వరూపమైన సత్తుకంటె, అన్యముగ యేదియులేదు, గావున, పరమాత్మకువస్తువులవలన పరిచ్ఛిన్నత్వములేదు—

ఇట్లువిచారించినందుచేతకూడ, బ్రహ్మేతరములేద నేసిద్ధించుచున్నది. "దేహమృత్పిణ్డ హేమ్నాంచ గాత్రభాజనభేదతః చరాచరణాం భూతానాం ద్వైతతానచసత్యతః" = దేహము, మృత్తు, స్వర్ణము, వీటికి, దేహములయొక్క పాత్రలయొక్క, ఆభరణాదులయొక్క భేదమువలన, భిన్నత్వముకలిగినట్లు, జంగమస్థావ రాత్మకమైన భూతములకు ద్వైతముకలిగినదియేగాని, యథార్థముగలేదు. అనగా, బ్రహ్మేతరములేదు. (బ్రహ్మపురాణము.) "ఏకస్సమస్తం యదిహాస్తికించిత్తదచ్యుతోనాస్తిపరంతతోన్యత్" = ఇక్కడ గనబడునదియంతయు యేకస్వరూపుడగు భగవంతుడే, అతనికంటెవేరైనదియును శ్రేష్ఠమైనదియును, లేదు. "స్థలేవిష్ణుర్జలేవిష్ణుః విష్ణుస్థావరజంగమాః, అంతర్విష్ణుర్బహిర్విష్ణు స్సర్వంవిష్ణుమయంజగత్" = స్థలము, జలము, స్థావరజంగమాదులు, వెలుపల, లోపల, అనగాసమస్తము విష్ణుస్వరూపము-(విష్ణుపురాణము.) పరబ్రహ్మస్వరూపమునకంటె వేరుగకాంచమైనను లేదని ఘోషించు ఇత్యాదిశ్రుతి స్మృతిసహస్రంబుల యథార్థమును "దృష్టింజ్ఞానమయీంకృత్వాపశ్యే ద్బ్రహ్మమయం

జగత్" "బ్రహ్మవత్త్వాహి పూర్ణత్వంతయా పూర్ణత్వమభ్యసేత్" = ఇత్యాదితేజోబిందూపనిషద్వాక్యములరీతిని చూపును, జ్ఞానాకారమైనదిగాజేసి, పరబ్రహ్మముపూర్ణమెయున్నదను బుద్ధిచేతను, గురువులవారానతిచ్చిన, యెరుక మరుపులేని స్వాభావిక సచ్చిదానందాద్వయబ్రహ్మసాక్షాత్కారనిష్ఠనుపొంది, చిరకాలాభ్యాసముచే, స్వానుభవమునకు తెచ్చుకొనవాడే బ్రహ్మజ్ఞాని- మరయు లోకమునందు ప్రవహించునట్టి, గంగా, గోదావరిమొదలగు నదులు, మహాసముద్రమును పొంది నామరూపములను తిరస్కరించగా, ఆ నామరూపములు లేనివై, లోకులచేత సముద్రమేయని యెట్లు చెప్పబడుచున్నదో, అట్లుపునరావృత్తిరహితమైన బ్రహ్మానందసముద్రమందు మగ్నులై, వాటివాటి నామరూపములను తిరస్కరించగా, వాటివాటి నామరూపములు లేనివై, బ్రహ్మవేత్తలచేత సమస్తము, ఆపురుషుడేయని చెప్పబడుచున్న-"యథా నద్యః స్యన్దమానాః సముద్రాయణాః సముద్రం ప్రాప్యాస్తంగచ్ఛన్తి భిద్యేతేతాసాం నామరూపే సముద్ర ఇత్యేవంప్రోచ్యతేఏవమేవాస్య పరిద్రష్టురిమాష్షోడశకలాః పు

రుషాయణాః పురుషం ప్రాప్య స్తంగచ్ఛంతి భిద్యేతే తాసాంనామరూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతే" శ్రుతిని విశ్వసించి ప్రవర్తించును - మరియు "యోహివృత్తిం విహాయైనాం బ్రహ్మాఖ్యాం పావనీంపరాంవృథైవతేతు జీవంతిపశుభిశ్చసమానరాః" = ఎవరు, ఇట్టివుత్కృష్టమైన, పునరావృత్తిరహితమైన ఆనందసముద్రమందు ఓలలాడుచు, పావనుడై ప్రకాశించుచుండవలెనని, గుర్వనుగ్రహమును పొందిన్ని, అట్టిభావమును వదలిపెట్టుదురో, వారిజీవితకాలము వ్యర్థమనిన్ని, వారు చతుష్పాదజంతువులకు సమానులనిన్ని, "ఏతాంవృత్తింవిజానంతి జ్ఞాత్వావైవర్ధయంతియే తేవై సత్పురుషాధన్యా వంద్యాస్తేభువనత్రయే" = గురువులవారానతిచ్చిన ఆత్మనిష్ఠయందు, నిరంతరముండి తద్వారాలభించిన సుఖామృతపానముచే మయిమరచినవారే సత్పురుషులు, కృతార్థులు, ముల్లోకములయందు నమస్కరించదగిన వారనిన్ని, "ఏషాంవృత్తిస్సమావృద్ధాపరిపాక్యాచసాపునః తేవైసద్బ్రహ్మతాంప్రాప్తానేతరేశబ్దవాదినః, కుశలాబ్రహ్మవార్తాయాంవృత్తిహీనాస్సురాగిణః తేప్యజ్ఞానతయానూనంపునరా

యాంతియాంతిచ" "అవిద్యాయామన్తరే వర్త
మానాః స్వయంధీరాః పణ్డితంమన్యమానాః దన్ద్రీ
మ్యమాణాః పరియంతిమూఢా అన్ధేనైవనీయమానా
యథాన్ధాః" ఎవరు సచ్చిదానందమందు, అనుసం
ధానముకలిగి మనోవృత్తివ్యాపారమువిడిచి అం
తటనిండినవారై ప్రకాశించుదురో, వారేసచ్చి
దానందస్వరూపమగు పరబ్రహ్మత్వముపొందుదు
రు, అట్లులేక, ఎవరు, నేనుబ్రహ్మమను వాక్యముచేమా
త్రిముపలుకుదురో వారున్ను, బ్రహ్మస్వరూపవిషయ
మై చమత్కారముగ మాట్లాడుటకుమాత్రము
నేర్చుకొని, శాస్త్రముచదివినవారమని గర్వించి,
శాస్త్రముయొక్క అంతరార్థము తెలియక, బా
హ్యార్థమును పట్టుకొని స్వానుభవములేక, సమ
స్తము, తెలిసినవారివలె గంతులు వేసెడు ఆభాస
వేదాంతులు, అనగా, అజ్ఞానాంధకారముచే చు
ట్టబడి, ప్రజ్ఞావంతులు పండితులమని తలంచు అ
జ్ఞానులు, యెచ్చుతగ్గు భూమియందు గ్రుడ్డివాని
చేతతీసికొనిపోబడిన, గ్రుడ్డివారివలె, నిశ్చయము
గజననమరణములను పొందుదురను ఇత్యాదితే
జోబిందు - కఠోపనిషద్వాక్యములను జ్ఞప్తియం

దుంచుకొని, యద్వా తద్వాసుగ సంభాషించక, దురాచారములు నవలంబించక, "నిమిషార్ధం న తిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీం వినా, యథా తిష్ఠంతి బ్రహ్మాద్యాస్సనకాద్యా శ్శుకాదయః" (తేజోబిందూపనిషత్.) "తస్మాత్సర్వం పరిత్యజ్య తత్త్వనిష్ఠో భవానఘ" (తురీయాతీతావధూతోపనిషత్.) "భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వా త్వమేతత్సమాచర, సర్వాక్షయవిజ్ఞానమస్తో నాశామహామతే" "స్వస్వరూపానుసంధానమేవం కృత్వా సుఖీభవ" (అన్నపూర్ణోపనిషత్.) "స్వరూపానుసంధానవ్యతిరిక్తాన్యశాస్త్రాభ్యాసైరుష్ట్రకుంకుమభారవద్వ్యర్థం తా" (సన్న్యాసోపనిషత్.) "స్వరూపానుసంధానం వినాన్యథాచారపరో న భవేత్" (వరాహోపనిషత్.) "సంశాంతసర్వసంకల్పః ప్రశాంతశకవేషయః, నిర్వికల్పపదం గత్వా స్వస్థో భవమునీశ్వర" (మహోపనిషత్.) ఇత్యాదిశ్రుతి సహస్రంబులరీతిని, సనకసనందనాదులు, శుకబ్రహ్మం, వసిష్ఠ్యాదిమహానుభావులు బ్రహ్మానందమగ్నులై, యెడతెగనిమౌననిష్ఠను పొందిసుఖించినట్లు, ఎవరు సమస్తసంకల్పములువదలి చిత్తవిశ్రాంతికలిగి, అన్య

శాస్త్రములయందును భోగములయందును, ఇచ్ఛ
లేక భ్రమలలోఁ జిక్కక, స్వప్రకాశమానమైన
బ్రహ్మజ్ఞానముచేత జ్ఞాననిష్ఠయందుందురో, వారే
జీవన్ముక్తులు. అయితే పరబ్రహ్మస్వరూపమందు నిశ్చ
యముగా మనస్సు లీనమైనను, శరీరముండుదాక
వారు అన్నపానాదులు పుచ్చుకొను సమయము
న, లేక "మచ్చింతనం మత్కథనమన్యోన్యం మ
త్ప్రభాషణం, మదేకపరమోభూత్వా కాలం నయ
మహామతే" అను వరాహోపనిషద్వాక్యరీతిని
వ్యవహరించు సమయమున, మనస్సు, బ్రహ్మమందు
లీనముగాక, భిన్నమై యుండును. భిన్నము కాక
యుండినయెడల కార్యములు జరుగవు, అట్లు ఒక
సమయమందు లీనమై, మరియొక సమయమున
భిన్నమయిన పక్షమున, వారు జీవన్ముక్తులుగారు
కదా, యనుశంకపరిహారార్థము (శ్రు) "ద్వివిధశ్చి
త్తనాశోస్తి సరూపోరూప ఏవచ" "సరూపోస్తి
మనోనాశో జీవన్ముక్తస్య విద్యతే, అరూపస్తు మ
నోనాశో వైదేహీ ముక్తిగోచరే" ముక్తికో
పనిషద్వాక్యములరీతిని; మనోనాశము, సరూప
మని అరూపమని, రెండువిధములు, అందు సరూ
పమనోనాశము జీవన్ముక్తులయందును, అరూప

మనోనాశము విదేహముక్తులయందుముండును - మరియు, (శ్లో) "చిత్తనాశాభిధానంహియదా తే విద్యతేపునః, మైత్ర్యాదిభిగుణైర్యుక్తం శ్వాంతి మే తినసంశయః" అను ముక్తికోపనిషద్వాక్య రీతిని, కరుణ, మైత్రి, ముదిత, ఉపేక్షాదినుగుణములతో కూడి- రాజసతామసవృత్తులు వదలి వ్యవహరించుటయే, సరూపమనో నాశనమని వున్నదిగాన వాండ్లువ్యవహారసమయమున "పద్మపత్రంయథా తోయైః స్వస్థైరపినలిప్యతే శబ్దాదివిషయాంభోభి స్తద్వజ్ఞానీనలిప్యతే" "యస్మాన్మంత్రబలాత్ పీతః క్రీడ సర్పై ర్నదశ్యదే, క్రీడన్నపినలిప్యేత, తద్వదింద్రియపన్నగైః" తామరాకు జలములో వుండిన్ని, ఆజలముచే అంటబడకయుండునట్లు, వాండ్లు విషయములను నీటిచేస్పృశింపబడరు. మరియు యేప్రకారము, మంత్రవేత్తలు, పాములతో ఆట్లాడుచున్నను, వాటిచేకరువబడక యుందురో, అదేప్రకారము వారు ఇంద్రియములను సర్పములతో, ప్రవర్తనయుండినను, ఆయింద్రియములను సర్పములచేకరువబడరు అనగా, ఇంద్రియమయులై - వాటివిషయములను కాటు

కులోబడరు, మరియు "లవణంతోయసంస్పర్శాత్ ద్రవతోయమయంభవేత్ మనోహి బ్రహ్మసంస్పర్శాత్ తథా బ్రహ్మమయంభవేత్" అను ఉపనిషద్వాక్యరీతిని ఉప్పు, నీటియందుగలసి, నీరై నటుల మనస్సు బ్రహ్మమందుగలసినంతట బ్రహ్మమయంబగును, ఆమనస్సు బ్రహ్మమయముకాగానే, మనోమయమైన ప్రపంచమంతయును బ్రహ్మస్వరూపమేయగును, కాబట్టి "మనసావచసాదృష్ట్యాగృహ్యతేన్యైరపీంద్రియైః అహమేవనమత్తోన్యదితిబుధ్యధ్వమంజసా" అనురీతిని మనస్సుచేతను, వాక్కుచేతను చూపుచేతను, చతుర్దశేంద్రియ వ్యాపారములచేతను, తలచినది, వచించినది, చూచినదిలోను గాగలవన్నియు, పరబ్రహ్మమేయనియు, అపరబ్రహ్మముతామేయని చాంచల్యములేక ప్రకాశించుదురు. ఇట్టివారేకృతార్థులు, బ్రహ్మవిద్వరిష్ఠులని వేదాంత సిద్ధాంతము.

నారాయణ నారాయణ నారాయణ.

శ్రీమత్సద్గురు జ్ఞానానందస్వామి [illegible]చరణార
విందాభ్యాం నమోనమః.

ఓమ్.

శ్రీమత్సద్గురు శాన్తానన్దస్వామినే చరణార
విన్దాభ్యాం నమోనమః.

# అభేదదర్పణమ్.

వడ్లనుదంచి పొట్టును రాలకొట్టుటవలన, వాని యందు మొలకలెత్తెడిశక్తి అణగిపోయినట్లు, మాయాసంబంధమగు పంచకోశాత్మకమైన, శరీరత్రయ, అవస్థాత్రయములందు, నామనస్సును వాసనలతోగూడి చలించనీయక విజ్ఞానస్వరూపునిగా జేసిన ఓ గురుస్వామీ! పరబ్రహ్మంబొక్కటియే తేజరిల్లుచున్నది, బ్రహ్మేతరములేనేలేదని శ్రుతిస్మృతిసహస్రంబులు బాహాటముగా ఘోషించుచుండియు, చతుర్ముఖబ్రహ్మమొదలగు ముప్పది మూడుకోట్ల దేవతలనియు, వారిలో త్రిమూర్తులు శ్రేష్ఠులనియు, ఆత్రిమూర్తులలో, నారాయణనామస్మరణ శ్రేష్ఠమని వైష్ణవులు, శివనామస్మరణశ్రేష్ఠమని శైవులుజెప్పెదరు - మరియు శైవవైష్ణవమతస్థులైన కొందరు పరస్పరముగా కలహించుకొనుచున్నారు, గనుక, ఈనామములమహిమ

యు, ఆశబ్దార్థంబులున్ను పరబ్రహ్మేతరములేద
నిఘోషించు శ్రుతిస్మృత్యానుసారముగ, బ్ర
హ్మవేత్తలు సమన్వయపరచుకొని ఆనందించువిధ
మును తెలియజెప్పి, కృతార్థుని జేయుమాయని
ప్రార్థింప? ఓయి సత్పురుషుడా! సర్వజ్ఞత్వస
ర్వేశ్వరత్వ, సర్వాంతర్యామిత్వసర్వభోక్తృత్వ,
సర్వస్వతంత్రత్వ, సర్వస్రష్టృత్వ, సర్వపాలకత్వ
సర్వసంహారకత్వ, సర్వసముత్వ, సర్వజీవదయాపర
త్వ, నిత్యత్వ, క్రియాశూన్యత్వ, నిస్సంగత్వ, నిర
స్తనిఖిలదోషత్వ, సర్వశక్తిత్వాది అనంతకళ్యా
ణగుణములుగలవియును, సగుణోపాసకులకు తగి
నవియును, సకలోపనిషత్స్వరూపములైనవియు
ను, నిర్వికల్పోపాసకులకు తగినవియును, ఏకమే
వాద్వితీయం బ్రహ్మఅను ఇత్యాదిశ్రుత్యర్థంబులవ
లన రెండవదిలేని పరమాత్మస్వరూపులముగనుం
డియు, మరచి, వేరుగ ప్రవర్తించుటచే గలుగు
అనర్థములను, గాలి మబ్బును చెదరగొట్టినట్లు పా
రదోలి అద్వయబ్రహ్మమయులై క్రీడించునటుల జే
యునవియు అయిన, శ్రీమన్నారాయణ, శివ,
రుద్రాదినామముల మహిమయేమనిపలుకుదును -
ఆమహిమ యిట్టిట్టిదని నిరూపింప వాగ్బుద్ధీంద్రియ

మానసంబులకలవిగావు. వేదశాస్త్రముల కగోచ
రము. అయినను, ఈదివ్యనామములలో, నొక్క
కటియు భవసాగరము నింకజేయునని వేదశా
స్త్రములు మొఱబెట్టుచున్నవి, మరియు, (శ్రు)
"నిద్రాలస్యే మోహరాగౌ మైథునం చౌర్యమేవ
చ ఏతే గుణాస్తామసస్య" అను శారీరకోపని
షద్వాక్యరీతిని, సోమరితనము, మోహము, ఆశ,
మైథునం, దొంగతనము, మొదలగు తామసగుణ
సంబంధమైన, వృత్తులను తాబేళ్లుగలదియు, (శ్రు)
"అహంకర్తాస్మ్యహంభోక్తా స్మ్యహంవక్తాభిమా
నవాన్ ఏతేగుణా రాజసస్య" అనువుపనిషద్వా
క్యరీతిని, నేను కర్త, నేనుభోక్త, వాచాలకుడను,
అభిమానముకలవాడను అను రాజసగుణసంబంధ
మైన వృత్తులను మత్స్యవర్గముగలదియు, అహంకా
రము, తత్సంబంధ అనర్థహేతువులగు వృత్తులనె
డు మొసళ్లుగలదియు, "ధూమేనావ్రియతే వహ్ని
ర్యథాదర్శో మలేనచ, యథోల్బేనావృతో గర్భస్త
థా తేనేదమావృతమ్" = పొగ నిప్పునున్ను, తుప్పు
అద్దమునున్ను, మావి గర్భపిండమునున్ను, గప్పి
యున్న రీతిని, కామము జ్ఞానమును కప్పుకొనియు
న్నదను భగవద్వాక్యరీతిని, బ్రహ్మజ్ఞానముదయిం

పనీయక, కప్పియుండు కామమనెడు పాచిగల
దియు, పుట్టుట గిట్టుటలనెడు తరంగములుగల
దియు, అష్టమదములనెడు సుడులుగలదియు,
అష్టమదములనగ - "అనఘకులంబు బలంబును
ధనము వయోరూపములును తపమును విద్యయున్ని
గూడినగనునష్టమదంబులవియా గాఢాత్ముండా"
అష్టకష్టములనెడు నీటిబుగ్గలుగలవియు - అష్ట
కష్టములనగ - "ఋణంయాచ్నా చవృద్ధత్వంజా
రచోరదరిద్రతా, రోగశ్చభుక్తశేషశ్చాప్యష్టకష్టాః
ప్రకీర్తితాః" లోభమనెడు నురుగుగలదియు, భ్ర
మయనెడు గట్టుగలదియు, నేనుజీవుడనని, ని
ర్ణయించుకొనుటచే కలుగుక్లేశము అవిద్యాక్లేశ
ము - ఇట్టి నిర్ణయమునకు కారణమైన మనస్సు
ను పరిత్యజింపకుండుటవలన కలిగెడు క్లేశము
అభినవక్లేశము - ఉదకములకు పల్లపుభూములం ప్రవ
హించుట సహజమైనట్లు, అభినవక్లేశముచే యిం
ద్రియములకు దుర్విషయములయందు దిరుగుటయే
స్వభావము, అట్టివిషయములందిచ్ఛగలిగి అందు
మగ్నులై విఱ్ఱవీగుచుండుట అస్తిత క్లేశము - ద్ర
వ్యమునందు అధికానురక్తిగలిగియుండుట రాగ
క్లేశము - ఉదరపోషణార్థము, యితరుల నాశ్ర

యించి వారివలన తనకోరికకొనసాగనందున వారల దూషించుట ద్వేషక్లేశము - ఇట్టిక్లేశములు తత్సంబంధమైన వృత్తులనెడు పాతాళమునంటిన జలప్రవాహముచే లోతుగలదియునైనట్టి క్రూరమగుసంసారమహార్ణవమునందుమునిగి, సారకాయ బుట్టువలెనుండు దేహమే తాననెడు భావమును పొందినవాడై (శ్రు) "సంకల్పనస్పర్శనదృష్టిమోహైర్గ్రాసాంబువృష్ట్యాత్మ వివృద్ధజన్మ కర్మానుగాన్యనుక్రమేణ దేహీస్థానేషురూపాణ్యభి సంప్రపద్యతే" అను శ్వేతాశ్వతరోపనిషద్వాక్యరీతిని నానా విధతలంపులచేత, త్వగింద్రియవ్యాపారములచేత, చూపులచేత, మోహముచేత, కర్మననుసరించి పొందిన ఆకారములను దేవతిర్యఙ్మనుష్యాదులయందు పుట్టుచు గిట్టుచు ఒకానొకజన్మమున పుణ్యాధీనమువలన, ఇట్టిసంసారము నిస్సారమని యెరిగి ఈనామములలోనొకటి నోటనెడలినతోడనే, సింగము ఏనుగను చీల్చినట్లు, నెమలి పామును పొడుచేసినట్లు సమస్తమహాపాతకముల నశింపజేసి, సంసారార్ణవమును దాటింపజేసును - సకలశుభములనిచ్చును - కోరినకోరికలకొనసాగించును - సమస్తనామములతో వెలుగుచుం

డునది సర్వపరిపూర్ణ పరబ్రహ్మస్వరూప మేయని తెలుసుకొని భేదములేక స్మరించుచుండు వానిని తన్నుగా తెలియజేసి "దాసోభృత్యస్సుతోబంధు ర్వస్తువాహన మేవచ ధనధాన్యసమృద్ధిశ్చాష్టాష్ట భోగాః ప్రకీర్తితాః" అను అష్టభోగములిచ్చి కాపాడును. అంతరబాహ్య శత్రుజయమును అనుకూలపరచును. మోక్షమును కరతలామలకము గనిచ్చి నిరతిశయానంద భరితులుగాజేసును-తోల్లనుగోరుకు శ్వానములకు ఘృతమరోచకమయి యుండునట్లు విషయాసక్తులకు యీదివ్యనామములు, తత్ప్రభావములు అరుచిగానేయుండును - భగవద్భక్తి గలుగజాలదు-మరియు, (శృ) "సత్యం జ్ఞానమనంతమానందం, సర్వశరీరోపాధివినిర్ముక్తం, కటకమకుటాద్యుపాధిరహిత సువర్ణఘనవద్విజ్ఞాన ఘనచిన్మాత్రస్వభావమాత్మ చైతన్యం బ్రహ్మ" = సత్యజ్ఞానానంతానందమయమైనది, యేవిధశరీరోపాధలేనిది, కటకమకుటాద్యుపాధిరహిత బంగారుముద్దవంటిది, జ్ఞానముద్ద, చిత్స్వభావము, ఆత్మచైతన్యము పరబ్రహ్మము. "నారాయణపరంబ్రహ్మ నారాయణనమోస్తుతే" (మహానారాయణోపనిషత్.) "రామఏవపరంబ్రహ్మ"

(రామరహస్యోపనిషత్.) "శివఏవస్వయంసా
క్షాదయంబ్రహ్మ" (మహోపనిషత్.) "పురాణా
నిసమస్తానిబుధార్థాఆగమాస్తథా, శైవాశ్చవైష్ణ
వాశ్చైవమదుక్తా ఆగమా అపి" (సూతసంహి
త.) ఇత్యాదనేకశ్రుతిస్మృతులచే నారాయణుడే
పరబ్రహ్మము, శివుడేపరబ్రహ్మము, రాముడే పర
బ్రహ్మమని, ఇట్లు బహుముఖములుగా బ్రహ్మత్వము
నుప్రతిపాదించుచున్నవి - మరియు "కారణేన
వినా కార్యంనోదేతి, భక్త్యావినాబ్రహ్మజ్ఞానంక
దాపినజాయతే, తస్మాత్వమపిసర్వోపాయాన్ పరి
త్యజ్య భక్తిమాశ్రయ, భక్తినిష్ఠోభవ, భక్తిని
ష్ఠోభవ, భక్త్యాసర్వసిద్ధయసిధ్యంతి, భక్తేరసాధ్యం
నకించిదస్తి -భక్త్యతిశయేనపక్వవిజ్ఞానంప్రాప్య"
(మహానారాయణోపనిషత్.) అనగా, కారణం
వినా కార్యోత్పత్తిలేనట్లు, భక్తిలేక బ్రహ్మజ్ఞాన
ములభించదుగాన, సమస్తవుపాయములను వదలి
భక్తినాశ్రయింపుము, భక్తిచేసాధింపని కార్యము
కొంచెమైననులేదు, భక్త్యతిశయముచే విజ్ఞాన
ములభించుననివున్నది, గాన, విష్ణువునందు దృఢ
భక్తిగలిగిన, వైరాగ్యముకలుగుననిన్ని, అట్టివివేకు
లకే విజ్ఞానప్రాప్తియనిన్ని, అవిజ్ఞానము క్రమేణ

పరిపక్వమై, ఆవలజీవన్ముక్తులగుదురనుటకు "తతోదృఢతరావైష్ణవీభక్తి ర్జాయతే తతో వైరాగ్యముదేతి వైరాగ్యాద్బుద్ధివిజ్ఞానావిర్భావోభవతి, అభ్యాసాత్తత్ జ్ఞానంక్రమేణ పరిపక్వంభవతి, పక్వవిజ్ఞానాజ్జీవన్ముక్తోభవతి" మహానారాయణోపనిషద్వాక్యము ప్రమాణమై యున్నది, ఇట్లనే, శివునియందు భక్తిసలిపే, అట్టిదశను పొందవలెననుటకు "యాతేరుద్రశివాతనూరఘోరాఽపాపకాశినీ, తయానస్తనువాశన్తమయాగిరిశన్తాభిచాకశీహి" శ్వేతాశ్వతరోపనిషద్వాక్యము ప్రమాణమై యున్నది - మరియు, సమస్తశాస్త్రములను క్రోడీకరించి మాటిమాటికివిచారించగా, నారాయణుడొకడే ధ్యానింపబడువాడుగా నిశ్చయింపబడుచున్నాడని, వేదవ్యాసుండు మహాభారతాంత్యమందు "ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్యచ పునః పునః ఇదమేకంసునిష్పన్నం ధ్యేయోనారాయణస్సదా" అని చెప్పియున్నారు. ఇట్లనే ప్రకృతికిమీరి మహత్తుకంటె మహత్స్వరూపముగా వెలుగునట్టి పురాణపురుషుడైన శివస్వరూపమును, సమస్తదేవతలు వుపాసించుచున్నారు, అట్టిదేవదేవుడైన

పరమేశ్వరుని సదాధ్యానించవలెననుటకు ప్రమాణ
ములు "పరాత్పరం యన్మహతో మహాంతం స్వ
రూపతేజోమయ శాశ్వతంశివం కవిం పురాణం
పురుషం సనాతనం సర్వేశ్వరం సర్వసురైరు
పాస్యం" (మహోపనిషత్.) "స తతంధ్యా
యేద్దేవ దేవగ్ సనాతనం" (శాండిల్యోపనిషత్.)
మరియు, నారాయణ అనెడు మంగళనామము
యెవనివాక్కుయందుండునో వానివెంట నారా
యణుడు, గోవు దానిదూడనుఅనుసరించినట్లు, అ
నుసరించియుండునని, అనగా, సర్వాభీష్టమును
కలుగచేసునని కైలాసయాత్రయందు శ్రీమహేశ్వ
రుండు "నారాయణేతియస్యాస్తేవదనేనామమం
గళం, నారాయణస్తమన్వేతి వత్సంగౌరివవత్స
లా" అనిచెప్పియున్నారు. " అభయంసర్వ
భూతేభ్యోదదామ్యేతద్వ్రతంమమ" = సమస్త
ప్రాణులను రక్షించుటయే నాయొక్కనియమము
(శ్రీరాములవాక్యము) "అనన్యాశ్చింతయంతో
మాం యేజనాః పర్యుపాసతే తేషాంనిత్యాభి
యుక్తానాం యోగక్షేమంవహామ్యహమ్"=ఏ
పురుషులైతే ఇతరాపేక్షలేక, నన్నేభజింపుచు
న్నారో, అట్టినిశ్చలచిత్తులైన వారియొక్క యో

గక్షేమములను, నేనే కాపాడుచున్నానని, అఖిలార్థ
ప్రదాయకుడైన శ్రీకృష్ణమూర్తి వాక్యము - ఇట్ల
నే, శివనామస్మరణచే సర్వాభీష్టముగలుగునని
"సఏకోరుద్రోధ్యేయస్సర్వేషాంసర్వసిద్ధయే"
శరభోపనిషద్వాక్యము ప్రమాణమైయున్నది -
మరియు, శివుడు ప్రసాదోన్ముఖమైన స్వరూపము
కలిగినట్టిన్ని, లెక్కలేని మనోవాంఛాఫలదాయ
కుడనిన్ని, యెవనియొక్క చిత్తము, పద్మములవం
టి వానిపాదములయొక్క సేవచేయుచున్నదో
అట్టిభక్తునకు యీలోకమందు సర్వమును స్వా
ధీనమై యుండుననుటకు శివానందలహరియను
గ్రంథమునందుండు శ్రీమత్ శంకర భగవత్పాదా
చార్యుల వాక్యములు "ప్రసన్నమూర్తిః అగణి
తఫలదాయకః" "యచ్చేత స్తవపాదపద్మభజ
నంతస్యేహాకిందుర్లభం" అయితే, "ఓంనమోనారా
యణాయేతి మంత్రోపాసకః వైకుంఠభవనంగమి
ష్యతి" అను నారాయణోపనిషద్వాక్య రీతిని
ఓం నమోనారాయణాయ అనుమంత్రమునుపా
సించువాడు వైకుంఠమును పొందును అనగా
మోక్షము లభించుననిన్ని "ఆదిపురుషస్యనారా
యణస్య నామోచ్చారణమాత్రేణ నిధూతక

లిఖణావతి'' (కలిసంతారణోపనిషత్) = ఆదిపు
రుషుడై భగవంతుడైన నారాయణునియొక్క
నామమును వుచ్చరించినమాత్రమున, కలిదోషము
ను పారదోలినవాడగునని బోధించుచున్న వే అ
నిన ! ఇట్లనేశరభోపనిషత్తులో ఓం మహోగ్రా
సాయ మహాదేవాయ, శివ అని, సదాస్మరించుట
చే, మోక్షములభించుచున్నదని యుండువా
క్యము, "ఓంమహోగ్రాసాయ మహాదేవాయశూ
లినే మహేశ్వరాయమృతాయ తస్మైరుద్రాయన
మోఅస్తు - శివయేవసదాఖ్యేయ స్సర్వసంసా
రమోచకః'' - మరియు "హరేరామహరేరా
మ రామరామ హరేహరే, హరేకృష్ణహరే
కృష్ణ కృష్ణకృష్ణహరేహరే, ఇతి షోడశకంనా
మ్నాం కలికల్మషనాశనం, నాతఃపరోతరోపా
యస్సర్వవేదేషుదృశ్యత ఇతి షోడశకలావృతస్య
జీవస్యావరణవినాశనంతతః ప్రకాశతే పరంబ్ర
హ్మ మేఘాపాయేరవిరశ్మిమండలీవేతి'' హరే
రామ, హరేరామ, అను పదియారు నామములు
కలిదోషమును నాశనము చేయును- ఇంతటికన్న
యెక్కువవుపాయము, సమస్తవేదములయందులే

ము - ఈపదియాఱునామములు, * పదియాఱు కళలచే, చుట్టబడియుండు జీవునియొక్క ఆవరణమును నాశనముచేసి, మేఘావరణముపోయినవెనుక, సూర్యమండలము ప్రకాశించులాగున పరబ్రహ్మప్రకాశము కలుగజేసును. ఈ విధముగనే "శ్రీరుద్రరుద్ర రుద్రేతి యస్తబ్రూయాద్విచక్షణః కీర్తనాత్సర్వదేవస్య సర్వపాపైః ప్రముచ్యతే" (రుద్రహృదయోపనిషత్.) "అచింత్యమవ్యక్తమనంతరూపం శివంప్రశాంత మమృతం బ్రహ్మయోనిం, తదాదిమధ్యాన్తవిహీనమేకం విభుం చిదానందమరూపమద్భుతం,

---

* ప్రాణము - ఆప్రాణమువలన సమస్తప్రాణులకు శుభకర్మహేతువగుశ్రద్ధ - ఆకాశము - వాయువు - తేజస్సు - ఉదకము - భూమి - ఇంద్రియములు-మనస్సు - అన్నము - ఆఅన్నమువలన సర్వకర్మప్రవృత్తిసాధనమగు సామర్థ్యము - కృచ్ఛ్రచాంద్రాయణాది రూపమయినతపస్సు - ఋగ్యజుస్సామాది మంత్రములు - ఆమంత్రసాధ్యమయిన యజ్ఞాదికర్మ - ఆకర్మముచేత పొందదగిన స్వర్గాదిలోకములు-ఆలోకమునందలి ప్రాణులకు నామములు - ఇవి పదియాఱుకళలు.

ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీ
లకంఠం ప్రశాంతం ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూత
యోనిం సమస్తసాక్షింతమసః పరస్తాత్ '' (కైవ
ల్యోపనిషత్.) = శ్రీరుద్రరుద్రరుద్ర యని ధ్యానిం
చువారు సమస్తపాపములనుండి విడువబడుతార
నిన్ని, సమస్తదేవతలను పొగడినవారగుదురనిన్ని
చింతించుటకు చూచుటకలవిగానివాడున్ను, అం
తములేని రూపముగలవాడుగానున్ను, (ఏదిదేని
వల్లనున్ను వేఱుపఱుపబడక అఖండమైయున్న
దో, అది అనంతం) మంగళస్వరూపిగాను ఆదిమ
ధ్యాంత రహితుడుగాను, మోక్ష స్వరూపుడు
గాను, మాయోత్పత్తికి కారణుడుగాను, అద్వి
తీయుడుగాను, సర్వవ్యాపకుడుగాను, జ్ఞానా
నందరూపుడుగాను, ప్రకృతి సంబంధరూపములే
నివాడును, అద్భుతవిగ్రహముగానున్ను, ప్రభు
వుగాను, త్రినేత్రములు, నీలకంఠము, గలిగి, పా
ర్వతితో గూడియుండెడు పరమేశ్వరుణ్ణి ధ్యా
నముచేసి మననశీలులు సమస్తమునకు ఉపద్రష్ట
యు, అజ్ఞానముకంటె పరమై, సమస్తభూ
తములయందధిష్టించి యుండు పరబ్రహ్మమును
పొందెదరు. మరియు "దేవఏకోనారాయణః

నద్వితీయోస్తి కశ్చిత్" = నారాయణుడొక్క
డే దేవుడు, రెండవవాడులేడు (నారాయణో
పనిషత్.) "ఏకోహిరుద్రో నద్వితీయాయతస్థు"
= రుద్రుడద్వితీయుడగుటవలన బ్రహ్మవేత్తలు
వేరొకవస్తువుకొఱకు నిలువకపోయిరి (శ్వేతాశ్వ
తరోపనిషత్) "ఏకఏవశివోనిత్యస్తతోన్యత్సకలం
మృషా" = నిత్యుడగు శివుడొక్కడేను,
వానికన్యమంతయు లేనిది (శరభోపనిషత్.)
"అతఃపరంనాన్యదణీయసగ్ హిపరాత్పరం య
న్మహతోమహాన్తం, యదేకమవ్యక్తమనన్తరూపం
విశ్వంపురాణంతమసః పరస్తాత్" ఏదిపరాత్ప
రమైమహత్తుకంటె మహత్తైనదియో, అదియే
సూక్ష్మమునకంటె సూక్ష్మమైనది, దీనికంటె సూ
క్ష్మమైనదిమరేదియునులేదు. అదిఅజ్ఞానమునకంటె
పరమందుండునదియును, ఇంద్రియములకగోచర
మును, అనన్తస్వరూపమును, ప్రపంచరూపము
ను, ఒకటియునైయున్నది. (తైత్తిరీయోపనిషత్.)
"ఏకస్తథాసర్వభూతాన్తరాత్మారూపంరూపంప్ర
తిరూపోబభూవ" = సమస్తభూతములయందుం
డు ఒకటియైన పరమాత్మ, ప్రతిఆకారమునుగు

రించి, సమానరూపముగలవాడైయున్నాడు. "నిత్యోనిత్యానాంచేతనశ్చేతనానామేకః" =నశించువాటిలో నశించనివాడై, బ్రహ్మాదిసర్వజీవులకు చేతనస్వరూపుడైయుండు పరమాత్మ ఒక్కడు. (కఠోపనిషత్.) "ఏకమేవాద్వితీయం, వాచారంభణంవికారోనామధేయమ్, ఏకమేవసన్నేహనానాస్తికిఞ్చన" = రెండవదిలేనివస్తువుఒకటె, వికారమునామధేయమువాగ్వ్యాపారమాత్రము,

---

ఇక్కడ ఒక్కటియేయైనది స్వల్పమైననుఅనేకవిధముగుటలేదు (ఛాన్దోగ్యోపనిషత్.) "ఏకోదేవస్సర్వభూతేషుగూఢః" = స్వయంప్రకాశమానుడగు పరబ్రహ్మముయొకడే, సర్వభూతములయందు రహస్యముగానున్నాడు. (గోపాలతాపన్యుపనిషత్) "ఏకోవిష్ణురనేకేషు జంగమస్థావరేషుచ తైలంతిలేషుకాష్ఠేషువహ్నిః క్షీరేఘృతంయధా" = నువ్వులయందు నూనె, అగ్నిమధనకట్టెలయందు నిప్పు, క్షీరమందునేయివలెనే ఒక్కడగువిష్ణువు జంగమస్థావ రాదులయందున్నాడు. (వాసుదేవోపనిషత్.) "ఏకఏవహి భూతాత్మా భూతేభూతేవ్యవస్థితః, ఏకధాబహుధాచైవదృశ్యతే జలచన్ద్రవత్" = సర్వస్వ

రూపుడగు ఒక పరమాత్మ ప్రతిభూతమందున్నవా
డై, జలమందుండు చంద్రునివలెనే, ఏకవిధము
గాబహువిధములుగా జూడబడుచున్నాడు. (త్రి
పురాతాపిన్యుపనిషత్.) "తురీయంనిరాకారమే
కంబ్రహ్మ"=బుద్ధ్యాదీంద్రియాతీతమైన, నిర్వికార
మగు పరబ్రహ్మమొక్కటేను. (మహానారాయ
ణోపనిషత్) "ప్రపఞ్చోపశమంశాన్తం శివమ
ద్వైతం చతుర్థంమన్యన్తేసఆత్మా" = ప్రపంచ
ముయొక్క ఆకృతి రాగద్వేషాది దోషములు అ
నగా, ప్రకృతిసంబంధవికారములులేని అద్వైతశి
వస్వరూపమును, తురీయమునుగా బ్రహ్మవేత్తలు
తలంచుచున్నారు. అది పరమాత్మస్వరూపము.
(మాండూక్యోపనిషత్) "ఏకమేవాద్వయంబ్ర
హ్మ" = సజాతివిజాతి స్వగతభేదరహితముగ ప్ర
కాశించునదిపరబ్రహ్మమొక్కటేను (అధ్యాత్మోప
నిషత్.) "సర్వభూతేషుయేనైకం భావమవ్యయ
మీక్షతే,అవిభక్తంవిభక్తేషు తత్ జ్ఞానంవిద్ధిసాత్విక
మ్" = ఏజ్ఞానముచేత సమస్తభూతములయందు,
అఖండమైనట్టిన్ని, నాశరహితమైనట్టిన్ని, ఏక
మైన పరమాత్మస్వరూపమును ఎవ్వడుచూచుచు
న్నాడో, ఆజ్ఞానమును సత్వగుణమువలన పుట్టిన

దాన్నిగాను తెలియుము. (భగవద్గీత.) "ఏకస్త్వేదభగవాన్ ధాతానారాయణః ప్రభుః" = సమస్తమునిచ్చు ప్రభువగు భగవంతుడైన నారాయణుడొక్కడేయని తెలిసికొనుము. (మహాభారతము.) "ఏకఏవపరోహ్యాత్మా భూతేష్వాత్మన్యవస్థితః" = సమస్తభూతములయందుండెడు పరమాత్ముడొక్కడేను (శ్రీమత్ భాగవతమ్.) "ఏకంసదైకంపరమః పరేశఃసవాసుదేవోనయతోఽన్యదస్తి" దేనికంటె నన్యమైనదిలేదో అటువంటిదియును, ఎల్లప్పుడు ఏకస్వరూపమైనదియు, పరస్వరూపుడగు పరేశుడే ఆవాసుదేవుడు-(శ్రీవిష్ణుపురాణం.) "ఏకోవ్యాపిసమశ్శుద్ధోనిర్గుణః ప్రకృతేఃపరః, జన్మవృద్ధ్యాదిరహిత ఆత్మాసర్వగతోఽవ్యయః" = ఏకస్వరూపమును, సర్వవ్యాపియును, సమస్వరూపమును, పరిశుద్ధమును, నిర్గుణమును, ప్రకృతికంటె పరమును, జన్మవృద్ధ్యాదులు లేనిదియునునగు ఆత్మ సర్వగతమైనాశన రహితముగానున్నది. (శ్రీవిష్ణుపురాణమ్.) ఇత్యాదిశ్రుతిస్మృతిప్రమాణములచొప్పునపరబ్రహ్మమైనదేవుడొకడేయని, నిస్సంశయముగసిద్ధించెను - మరియు, "తస్యాఃశిఖాయామధ్యేపరమాత్మావ్యవస్థితః, సబ్ర

హ్మాసశివస్సేన్ద్రస్సోక్షరః పరమస్స్వరాట్'' = అట్టిజ్వాలయొక్క మధ్యమునందు, ఆపరమాత్మ యగు నారాయణుడున్నాడు, అతడే శివుడు బ్రహ్మ ఇంద్రుడు, ఈమొదలైనవారందఱునైశ్రేష్ఠుడును, ముక్తుడును కర్మాధీనుడునుగాక స్వకీయముగా ప్రకాశించెడి పరమాత్మయైయున్నాడు. (తైత్తిరీయోపనిషత్.) "సబ్రహ్మాసశివస్సేంద్రః సోక్షరఃపరమస్స్వరాట్, స్సఏవవిష్ణుస్సప్రాణస్సకాలోగ్నిస్సచంద్రమాః'' = అతడేబ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, నాశనములేనివాడు, శ్రేష్ఠుడు, స్వకీయముగాప్రకాశించువాడు, విష్ణువు, ప్రాణుడు, కాలుడు, అగ్ని, చంద్రుడు. (కైవల్యోపనిషత్.) "సబ్రహ్మసవిష్ణుస్సరుద్రస్స ఇంద్రస్ససర్వేదేవాస్సర్వాణిభూతాని'' = అతడేబ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు, మొదలగు సమస్తదేవతలు, అతడేసమస్తభూతములు (శాండిల్యోపనిషత్.) "త్వంయజ్ఞస్త్వంవిష్ణుస్త్వంవషట్కారస్త్వం రుద్రస్త్వం బ్రహ్మత్వంప్రజాపతిః'' =ఓపరబ్రహ్మమా! నీవేవిష్ణువుగాను, అగ్నియందువేల్చనట్టిహవిస్సుగాను, రుద్రుడవుగాను, బ్రహ్మవుగాను, హిరణ్యగర్భుడవుగాను నుంచున్నావు. (తైత్తిరీ

యోపనిషత్.) "అథనిత్యోనారాయణః, బ్రహ్మా నారాయణః, శివశ్చనారాయణః, శక్రశ్చనారాయణః, దిశశ్చనారాయణః," = నారాయణుడు నిత్యుడు, బ్రహ్మనారాయణుడు, శివుడు నారాయణుడు, ఇంద్రుడు నారాయణుడు, దిక్కులు నారాయణస్వరూపము. (మహానారాయణోపనిషత్.) "యోహవై రుద్రస్సభగవాన్ యశ్చబ్రహ్మా, యశ్చవిష్ణుః, యశ్చమహేశ్వరః, యశ్చవినాయకః, యశ్చస్కందః, యశ్చేంద్రః" = ప్రసిద్ధికెక్కిన భగవంతుడగురుద్రుడే,బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, వినాయకుడు, కుమారస్వామి, ఇంద్రుడు (అథర్వశిరోపనిషత్.) "యోహవై నృసింహోదేవోభగవాన్, యశ్చబ్రహ్మా, యశ్చవిష్ణుః, యశ్చమహేశ్వరః, యశ్చోంకారః, యేచైకాదశరుద్రః, యశ్చవిరాట్పురుషః" = ప్రసిద్ధికెక్కిన భగవంతుడగు నృసింహమూర్తియే బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, ఓంకారవాచ్యుడైన పరబ్రహ్మస్వరూపము, ఏకాదశరుద్రులు, విరాట్పురుషుడు (నృసింహతాపిన్యుపనిషత్.) "బ్రహ్మైవపరమాత్మా, సబ్రహ్మ,సవిష్ణుః,సరుద్రః"

బ్రహ్మమేపరమాత్మ, అతడేవిష్ణువు, రుద్రుడు(నిరాలంబోపనిషత్.) "శివాయవిష్ణురూపాయ, శివరూపాయవిష్ణవే, శివస్యహృదయంవిష్ణు, విష్ణోశ్చహృదయంశివః, యథాంతరంనపశ్యామి తథామే స్వస్తిరాయుషి యథాంతరం నభేదాస్యుశ్శివ కేశవయోస్తథా" = విష్ణురూపముగానుండు శివుణ్ణీ గురించిన్ని, శివరూపముగానుండు విష్ణువునిగురించి నమస్కారము - శివునియొక్క హృదయమే విష్ణువు, విష్ణువుయొక్క హృదయమేశివుడు, యెట్లు ఇరువరులలో భేదమునాకగుపడలేదో, అట్లు నాకుసంతోషము, అయుస్సు, కలుగుగాక-శివకేశవులలో భేదములేదు (స్కందోపనిషత్.) "రుద్రాణాంశంకరశ్చాస్మి" "సేనానీనామహంస్కంద" = ఏకాదశరుద్రులలో శంకరుడునేనే, సేనానాయకులలో కుమారస్వామినేనే, (భగవద్గీత.) "పారురువిల్ నీరెరికాల్ విశుంబుమాగి, పల్వేఱుసమయముమాయ్ పరందునిన్ర, ఏరురువిల్ మూవరుమేయెననిన్ర, యిమైయవర్ తంతిరువురువే ఱెణ్ణుంబోదు, ఓరురువంపొన్నురువమొనున్ఱు శెంద్, వొన్రుమాకడలురువమొత్తునిన్ర, మూవురుపుంకండపోదొన్రాంశోది, ముగిలురుపమెమ్మడిగళురువం

దానే. (తిరుమంగై యాళ్వార్) "విష్ణోరన్యంత పశ్యంతి యేమాంబ్రిహ్మాణమేవచ, కుతర్క్కమత యోమూఢాః పచ్యంతేనరకేష్వధః, యేచమూఢాదురాత్మానో భిన్నంపశ్యంతిమాంహరేః, బ్రిహ్మాణంచతథాతేహంభూ్రిణహత్యాసమంత్వఘం" = నన్నైనను, బ్రిహ్మదేవునైనను, విష్ణునికంటె అన్యముగా యెవరుజూతురో, మరియు, మాము వ్వురకు భేదంబెవ్వరుకల్పింతురో, వారలు, మహానరకంబులం బొందుదురనియు, భూ్రిణహత్యాదోషమును జెందుదురని, శ్రీమహేశ్వరుండు జెప్పియున్నాడు. (భవిష్యత్పురాణం.) "హరిరేవశివస్సాక్షాచ్ఛివఏవహరిస్స్వయం, తయోర్భేదంప్రకుర్వాణః రౌరవంనరకంవ్రజేత్" = హరియే సాక్షాత్ శివుడు, శివుడేస్వయంహరిస్వరూపుడు, ఇరువురకుభేదంబెవరుకల్పింతురో, వారురౌరవ నరకంబొందుదురు, (భవిష్యత్పురాణం) ॥ఉ॥ "శ్రీయనగౌరినాఁబరఁగు చెల్వకుఁజిత్తముపల్లవింపభద్రాయితమూర్తియైహరిహరంబగు రూపముదాల్చివిష్ణురూ। పాయనమశ్శివాయయని పల్కెడు భక్తజనంబువైదిక। ధ్యాయితకిచ్చమెచ్చుపరతత్వము గొల్చెదనిష్టసిద్ధికిన్ ॥ (విరాటపర్వము.)

ఇత్యాది ప్రమాణములచొప్పున, శివవిష్ణువులకు భేదము లేమి, నిస్సంశయము గాస్ఫురించుచున్న ది-

మరియు, "సత్త్వాత్సంజాయతేజ్ఞానం" "త్రివిధంనరకస్యేదంద్వారం నాశనమాత్మనః, కామః క్రోధ స్తథాలోభ స్తస్మా దేతత్త్రయంత్యజేత్" "అహంకారంబలందర్పం కామంక్రోధంపరిగ్రహం, విముచ్యనిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయకల్పతే" అను, ఆశ్రితవాత్సల్యైకనిధియగుశ్రీకృష్ణభగవానుల వాక్యములచొప్పున, జ్ఞానోత్పత్తికి కారణమైన సత్త్వగుణము నవలంబించి నరకప్రాప్తికి హేతువులగు, కామము, క్రోధము, లోభమను మూడుగుణములను విడిచిపెట్టి- అహంకారము, సామర్థ్యము, దర్పము (నేనుసర్వవిషయముల యందు సమర్థుడను నాకుసాటియైన మేటియే చోటలేదనుచిత్తవృత్తి) కామము, క్రోధము, గృహదారాదులయందుఆసక్తి, మమకారము, దురాగ్రహమువిడిచినవాడే పరబ్రహ్మభావమునుపొందుటకుసమర్థుడగుచున్నాడనుటను విశ్వసించి, తద్వ్రతపతిపాలించుచు మతవైషమ్యములేక, పక్షవాదమునుమాని, సత్యమును ఊనియుండుటయుచితమనితోచుబుద్ధిమంతులకు మాత్రమే, బహువిధ

నామరూపములలో బహు సిద్ధాంతములయందు బహుజనులచే ఆరాధింపబడు పరబ్రహ్మస్వరూపము ఒకటియైయున్నదని, నిర్వికల్ప బ్రహ్మనిష్ఠయందును వేదాంతశాస్త్రములయందును, అనుభవముగల బ్రహ్మవేత్తలుబోధించు అభేదవాక్యముల యదార్థముస్ఫురించును. ఇట్లెరుగక మహాపండితులలో కొందఱు శివుడు దేవుడుకాడు, వానిపేరుస్మరింపరాదనిన్ని - విష్ణువు దేవుడుకాడు, వానిపేరుస్మరింపరాదని వాదులాడెదరు, వారిపుణ్యమెంతని కొనియాడవచ్చును. అయితే, "నహినానాస్వరూపంస్యాదేకంవస్తుకదాచన" అను వరాహోపనిషద్వాక్యరీతిని ఒకవస్తువు యెప్పటికిని అనేకవిధంబులుగలది కాదనియుండగా వేరువేరుగా చూడబడుటకు కారణమేమనగా- "సితనీలాదిభేదేనయథైకం దృశ్యతేనభః, భ్రాంతిదృష్టిభిరాత్మాపితథైకస్సన్ పృథక్ పృథక్" అను శ్రీవిష్ణుపురాణమునందుండు వాక్యరీతిని ఒక్కటైనటువంటిఆకాశము యెట్లు తెలుపునలుపుమొదలైనభేదములతో జూడబడునో అదేప్రకారము ఒక్కటేయైయుండుపరమాత్మ, భ్రాంతిదృష్టిగలవారిచేత వేరువేరుగా జూడబడుచున్నాడు

"ద్వైతభ్రాంతిరవిద్యాఖ్యా" అనుబ్రహ్మపురాణమందుండు వాక్యరీతిని ఇట్టిద్వైత భ్రాంతియే అవిద్యయను పేరుగలది - మరియు "రజ్జౌ సర్పభ్రాంతిరివాఽద్వితీయేసర్వానుస్యూతేసర్వమయెబ్రహ్మణిదేవ......నానాత్మభేదకల్పితంజ్ఞానమజ్ఞానం" రెండవదిలేని, సర్వానుస్యూత మైసమస్తవస్తుస్వరూపమైవెలుగు పరబ్రహ్మస్వరూపమందు దేవతాది, భేదములను, త్రాటియందు సర్పభ్రాంతివలె కలుగజేసుకొనిన కల్పనజ్ఞానమే, అజ్ఞానము-ఇత్యాదిప్రమాణముల చెప్పిన పేరు పేరుగా జూడబడుటకు కారణము అజ్ఞానమనే, ఇంచుకయైనను సందియములేక సిద్ధించుచున్నది-ఇట్టి అజ్ఞానము, స్వతంత్రముగలదనెడి భ్రమనుపుట్టించి భోగవాంఛను ప్రబలించి, తెలివిని నశింపజేసి దుఃఖములపాలుజేసును, జననమరణాదులు యెడతెగక, గలుగుటసిద్ధమనుటకు, తైత్తిరీయకఠోపనిషద్వాక్యములు "యదాహ్యేవైషఏతస్మిన్నుదరమనంతరంకురుతే, అథతస్యభయం భవతి" "మృత్యోస్సమృత్యుమాప్నోతియ ఇహ నానేవపశ్యతి" ప్రమాణములైయున్నవి-అయితే ఒక్కవస్తువునకు అనేకములైన పేళ్లుకలుగునా?

కలుగును ఒక్కడు ఒక్కనికిపుట్టినందున పుత్రు
డు, తోడబుట్టినవారిలో జ్యేష్ఠుడైనయెడల అ
న్న, కనిష్ఠుడైనయెడల తమ్ముడు, ఆలికిమగడు,
అత్తమామలకు అల్లుడు, భార్యతోడబుట్టినవా
రికి బావమఱది, ఉద్యోగస్థుడైన పక్షమున ప్రి
భువు, చిల్లరపనులుచేసిన పరిచారకుడు, మిత్రు
నికిమిత్రుడు, శత్రువునకుశత్రువని, లెక్కలేనిపే
ళ్లుగలవాడు ఒక్కడేగాని పెక్కండ్రుకారు-
ఇన్నిధర్మములొకనియందుండుటచే ఒకడే అం
దఱకు నన్నివిధములనున్నాడు, గాన ఒక్కవ
స్తువున కనేకనామములు కలుగవచ్చును. అయి
నను, తత్వమును విచారించినపక్షమున ఆపురుషు
నికి రూఢినామ మొక్కటియులేదు. ఇటువలెనే
కుమారుడు తమ్ముడుభర్తమొదలగు ఈనామము
లువారివారి యధ్యవసాయానుగుణముగ ఆయా
నామము తగియున్నదేగాని వివేకయుక్తమై శాం
తచిత్తతతో తత్వశోధన చేసినయెడల నొకటి
యైననిలువదు - నామరూపరహిత స్వస్వరూప
మే శేషించును. అయితేదేవుడు అనేక ఆకార
ములుగలవాడని బోధించుశాస్త్రములకేమిగతి ?
" ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణోరూపక

ల్పనా" (రామతాపన్యుపనిషత్.) "చన్ద్రసూర్యా
దీనాంజలాద్యుపాధిషుచ ఉపాధికృతనానాత్వవ
చ్చబ్రహ్మణోప్యుపాధికృత నానాత్వరూపస్యవిద్య
మానత్వాత్తదాకారవతోబ్రహ్మణ ఆకారవిశేషో
పదేశ ఉపాసనార్థోనవిరుధ్యతే" = చంద్రు
డుసూర్యుడు మొదలగువాటికి వుదకము మొద
లైన ఉపాధులయందు, ఆ ఉపాధులచేతగలుగు
అనేకఆకారములవలెనే, పరబ్రహ్మమునకును, ఉ
పాధులవలన నానావిధరూపములుకలుగుటవల
న, ఆ,ఆకారములుగల పరబ్రహ్మమునకు ఆకారవి
శేషములు ఉపాసనానిమిత్యార్థమై చెప్పబడె
ననిన్ని, అట్లుభేదశృతి స్మృతులు ప్రవర్తిం
చినందుచేత ప్రయోజనమున్నదేగాని విరుద్ధమ
గుట లేదనుటకు శ్రీమత్ శంకర భగవత్పాదాచా
ర్యుల రామతాపన్యుపనిషద్వాక్యములు ప్రమాణ
ములు. "సయథాసైన్ధవఘనోఽనన్తరోఽబాహ్యః
కృత్స్నోరసఘనఏవైవంవా అరేఽయమాత్మాఽన
న్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘనఏవ" (బృ
హదారణ్యకోపనిషత్.) = బాహ్యాంతరభేదము
లేని ఉప్పు కల్లుయొక్క సర్వావయవమున్ను
నీటిగడ్డయైనట్లు బాహ్యాంతరములులేని ఈసర్వాత్మ

రియును ప్రజ్ఞానము యొక్క ఘనీభావమేయగుచున్నది. "యతో వాచోనివర్తన్తే అప్రాప్యమనసాసహ" (తైత్తిరీయోపనిషత్) = ఏ బ్రహ్మమునుండి వాక్కులు మనస్సుతోఁగూడ పొందలేక మరలిపోవుచున్నవో (వాక్కులచే మనస్సుచే పొందనశక్యమైనది పరబ్రహ్మము.) "విశ్వస్యరూపవైరూప్యం లక్షణంపరమాత్మన" = పరమాత్మకు ప్రపంచ స్వరూపముయొక్క వైరూప్యమే లక్షణము (వైరూప్యం = రూపములేకపోవుట) "సర్వోవైరుద్ర" = ఈసమస్తమున్ను రుద్రస్వరూపము. "చక్షుశ్చద్రష్టవ్యంచ నారాయణః, శ్రోత్రించ శ్రోతవ్యంచ నారాయణో ఘ్రాణశ్చఘ్రాతవ్యంచ నారాయణో జిహ్వాచరసయితవ్యంచ నారాయణోత్వక్చస్పర్శయితవ్యంచ నారాయణోమనశ్చమన్తవ్యంచ నారాయణోబుద్ధిశ్చబోద్ధవ్యంచ నారాయణో, సర్వంనారాయణః" (సుబాలోపనిషత్.) "సచ్చత్యచ్చాభవత్, నిరుక్తంచానిరుక్తంచ, నిలయనంచానిలయనంచ, విజ్ఞానంచావిజ్ఞానంచ, సత్యంచానృతంచసత్యమభవత్". (తైత్తిరీయోపనిషత్.) = ఆపరమాత్మ సమానఅసమాన వస్తువులవలన దేశకాలాదులతోఁగూడు కొనుటచేతఅదిఇదియని

చెప్పబడునదియును సమస్తమునకు ఆధారమును; చేతనమును, వ్యవహారమునందలిపదార్థములసత్య స్వరూపమునగుమూర్తద్రవ్యమును, ఇది అదియనివ్య వహరింపబడనిదియును దేనికిని ఆధారముకానిది యును చేతనరూపముకానిదియును మిథ్యాస్వ రూపమునగు శుక్తికయందు రజితభ్రమరూపము నై అమూర్తస్వరూపమును ఆయెను-ఇట్లు సమస్త ము పారమార్థికసత్యమగు పరబ్రహ్మమేయనిబో ధించు ఇత్యాదనేకశృతిస్మృతులచేత లోపల వె లుపలదోచెడి సకలవ్యాపారభ్రమము శూన్యమై అత్యాశ్చర్యకరమైన ముఖ్యలక్షణములచేత లక్షి తమగుపరబ్రహ్మమునకు, నారాయణ, శివ, విష్ణు, విరాట్, బ్రహ్మ, వాసుదేవ, రామ, రాఘవ, కృష్ణ, హరి, రుద్రః ఆత్మఅను ఇత్యాద్యనేకశబ్దములు, ఘట, కుంభ, కలశ, శబ్దంబులవలె పర్యాయనా మంబులు అథవాభేదంబున్నదనిన సత్వవృత్తితో గూడిన విచారణలేమిచేశబ్దమాత్రభేదంబేగాని లే శమైనను వస్తుస్వరూప భేదంబులేదు—ఈయం శ ములలో మనశ్చలనముపొందక ధీరుడై, జహల్లక్షణ అజహల్లక్షణ, జహదజహల్లక్షణ, అనుమూడుల క్షణలచేత, వేదశాస్త్రపురాణేతిహాసముల యంద

లిసమస్త శబ్దములకును సమన్వయము చేసుకొని, స్వానుభవమను స్వర్ణపాత్రమున, పరమభక్తియ నుపాలుపోసి, శాంతిసుఖమను శర్కరను కలిపి, నిరతిశయానందమను రుచి ననుభవించవలెను - అదెట్లనిన? నారాయణః - రిష్యతేక్షీయత ఇతిరః రిజ్ క్షయేధాతుః అనగా నశింపబడునదిరః, న న భవతీతినరః, అవినాశాత్మ - నరయనగా నశింప నిది - పరబ్రహ్మము - మరియు, "నారంవిజ్ఞానం తదయనమాశ్రయోయస్యసః నారాయణః" = నారం అనగావిజ్ఞానము, ఆవిజ్ఞానము నకాశ్రయమైన వాడునారాయణుడు - పైగా, "నరాజ్జాతానితత్వాని నారాణీతి విదుర్బుధాః" = నరునివలన బుట్టిన అవ్యక్తాదితత్వములు నారములు - ఆతత్వములకు నీవు, నీకాతత్వము లాశ్రయముగా గలవాడా - నారాయణా - అపరోక్షజ్ఞానమునకు స్థానమైనవాడా, లేక అపరోక్షజ్ఞానమే స్థానముగాగలవాడా - మరియు, నారంవిజ్ఞానంతదయనమితివాతదయనమస్యేతివా నారాయణః అ నివ్యుత్పత్తి - రాశబ్దాః అయంతేనిర్గచ్ఛంతే య స్మాత్సఃరాయణః, రాయణాదన్యః అరాయణః, అ రాయణోనభవతీతినారాయణః శబ్దగమ్యఇత్యర్థః

అనుకీతిని ఎవనివలన శబ్దములు పుట్టుచున్న వో అతడు రాయణుడు, రాయణుడుగానివాడు అరాయణుడు - అరాయణుడుగాని వాడు నారాయణుడు, అనగా శబ్దగమ్యుడు. "నారాయణ పరంబ్రహ్మతత్వంనారాయణఃపరః, నారాయణప రోజ్యోతి రాత్మానారాయణఃపరః" = నారాయణుడే పరబ్రహ్మము - నారాయణుడే పరంజ్యోతి నారాయణుడే ఆత్మ (తైత్తిరీయోపనిషత్.) శివ- పశికాంతౌ అనుధాతువువలన సూర్యచంద్రాగ్నుల కాంతులమీరి వెలుగువాడు. విష్ణువు - విశ్వంవేష్టి వ్యాప్నోతీతివిష్ణుః - విషల్వ్యాప్తౌధాతుః = అంతర్బహిర్వ్యాపనశీల పూర్ణవస్తువు విష్ణుశబ్దార్థము- విరాట్ - విశేషేణరాజత ఇతి విరాట్ అనెడు వ్యుత్పత్తిచేత మిగులప్రకాశించుచుండువాడు - బ్రహ్మ - "బృహిర్బృహ్మవృద్ధౌబృహతేర్ధాతోః అర్థానుగమాత్, దేశతఃకాలతఃవస్తుతః అపరిచ్ఛిన్నం యద్వస్తుతద్బృహ్మేతిభాష్యం" = ఏదిమిక్కిలివిస్తారమైనదై, పంచభూతములను వానికార్యములతోగూడిన సమస్తజగంబునందును వ్యాపకత్వముకలిగియున్నందున, దేశముచేతను, అనా

దియై నిత్యంబై దేహవ్యతిరిక్తంబై యున్నందున భూతభవిష్యద్వర్తమాన కాలముచేతను, మృత్తిక యందుదోచెడి ఘటము మొదలయినవి యామృత్తికకంటె వేరుగానట్లు సర్వస్వరూపంబై యున్నందున వస్తువుచేతను పరిచ్ఛేదంబులేక యుండునో అది బ్రహ్మము - అనగా దేశకాలవస్తుకృత త్రివిధపరిచ్ఛేదకంబులేక ప్రకాశించునది బ్రహ్మము - వాసుదేవ॰ వసనివాసే ఇత్యస్మాద్ధాతోః వసత్యస్మిన్సర్వ మితివాసుః, దీవ్యతేః ప్రకాశత ఇతి దేవః సచాసౌ సచేతివాసుదేవః = సమస్తము యెవనియందుగలదో వానియందె యెవడుండి వెలుగుచున్నాడో వాడు వాసుదేవుడు. రామ "రమతీతి వారామః" యోగులయొక్క హృదయములయందు రమించుచున్నవాడు, "ఆద్యోరాతత్పదార్థస్స్యాన్మకారస్త్వం పదార్థవాన్, తయోస్సంయోజనమసీత్యర్థేతత్వవిదోవిదుః" (రామరహస్యోపనిషత్.) అనగా, తత్త్వమసియను సామవేదమహావాక్యలక్ష్యార్థస్వరూపమై, ఇట్టిమహావాక్యోపదేశంబుచేగలుగు బ్రహ్మాత్మైక్యానుసంధానంబుగల వారానందించు నిత్యానంద, చిన్మయ, నిష్కళా

**ద్వితీయ స్వరూపము** పరమాత్మ, రామశబ్దార్థము. "రమంతేయోగినోనంతే నిత్యానందే చిదాత్మని, ఇతిరామపదేనాసౌపరబ్రహ్మాభిధీయతే, చిన్మయస్యాద్వితీయస్యనిష్కళస్యాశరీరిణః" (రామతాపన్యుపనిషత్.) శ్రీఅధ్యాత్మ రామాయణ, కిష్కింధాకాండమున, శ్రీరామమూర్తివాలిని చెట్టుచాటుననుండి కొట్టినట్టు చెప్పియుండుటకేమి తాత్పర్యము? "సమానేవృక్షేపురుషోనిమగ్నః" అనుముణ్డకోపనిషత్తునందు ఈశరీరము వృక్షముగా చెప్పబడియున్నది - ఈమనుష్యదేహమనేడు చెట్టు, మేలుకీడు అనెడు రెండుఫలములుగలదియును, ధర్మము అర్థము కామము మోక్షము అనెడు నాలుగురసములుగలదియు, చెవి చర్మము కన్ను నాలుక ముక్కు అనుజ్ఞానేంద్రియముల విషయములయిన శబ్దము స్పర్శము రూపము రసము గంధము అనునవియనెడు ఊడలుగలదియును, ఆకలి, దప్పి, దుఃఖము, ఆశ, ముదిమి, చావు అనుషడూర్ములనెడు స్వభావగుణములు గలదియును, చర్మము మాంసము నెత్తురు మెదడు క్రొవ్వు ఎముకలు రేతస్సు అను సప్తధాతువులనెడు మీదిపొరలుగలదియును, భూమిజలముఅగ్నిగాలిమిన్ను

మనస్సు బుద్ధి అహంకారమనునట్టి యష్టప్రకృతుల నేడు కొమ్మలుగలదియును, నవరంధ్రముల నేడుతొఱ్ఱలుగలదియును, ప్రాణాపానవ్యానోదానసమాననాగకూర్మకృకరదేవదత్త ధనంజయము లను పదివిధములైన ప్రాణముల నెడుఆకులుంగలదియును, జీవుడు ఈశ్వరుడు అనెడు రెండుపక్షులుగలదియునగును. "స్వాత్మారామతాప్రాప్తిఃస్వస్యఆత్మాస్వాత్మాస్వాత్మనిఆరమతే ఇతిస్వాత్మారామః, తస్యభావః స్వాత్మారామతాతస్యాఃప్రాప్తిః" అనురీతిని దేహధారుడైయుండియు దేహాదులకు విలక్షణమై స్వప్రకాశ రామ బ్రహ్మముతానని ఆనందించు బ్రహ్మవిద్వరిష్ఠుడనిసిద్ధించుచున్నది. ఇట్టి బ్రహ్మజ్ఞానివద్దకు తిర్యగ్జాన్మసాదియోనులయందు జన్మించుచు ఒకానొకప్పుడు అనేకజన్మములయందు పరిశుద్ధమైన పుణ్యాతిశయమనెడి నిమిత్తము వలన "యథాపంకేనపంకాంభః, సురయా వాసురావృతః, భూతహత్యాంతథైవైకాంనయ జ్ఞైర్మార్ష్టుమర్హతి" బురదనుబురదనీళ్లతో కడుగుకొనగానే బురదవదలునట్లును, కల్లుకుండను కల్లుపోసి కడుగగానే కల్లుకంపుపోనట్లు కర్మచేతకర్మనశింప

[illegible]దుర్యా[illegible]వసంమంయు వాక్యార్థముయ థార్థముగ స్ఫురింపగలిగి, శమదమాదిసంపన్నుడై [illegible]హితమైనసత్తపాది యజ్ఞయోగాదికర్మ [illegible]ంచుటయనుచితమనిలోంచి బ్రహ్మ విచార ణాసయుక్త దేహనిర్వాహక కర్మచేయుచు, ఫలము న పేక్షింపక, బ్రహ్మార్పణముజేసి స్వస్వరూపాను సంధానము నందుండవలె ననెడు శుభేచ్ఛగలిగి వచ్చినసత్పురుషునికి " తస్మైసవిద్వానుపపన్నాయ సమ్యక్ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ, యేనాక్షరం పురుషం వేదసత్యం ప్రోవాచతాం తత్త్వతో బ్రహ్మవిద్యాం"=పరిపూర్ణమైన అక్షరపరబ్రహ్మ స్వరూపమును తెలిసికొనుటకు సాధనమైన బ్రహ్మవిద్యను గ్రహించుటకు, బాహ్యేంద్రియాంతరింద్రియోపరమము కలిగి తన సమీపమునకువచ్చి యుండెడి సత్పురుషునికొఱకు బ్రహ్మజ్ఞాని యథార్థముగా నుపదేశించవలయునని యుండు ముణ్డకోపనిషద్వాక్యరీతిని బోధించవలసినది అత్యావశ్యకముగానుండుటచే, వాలి=వాలమస్యాస్తీతి వాలియనియుత్పత్తి, "బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠ" అనిశ్రుతి గనుక వాలమనగా కర్మకాండ-నివృత్తిం

కర్మసేవేత ప్రవృత్తిమత్పరస్త్యజేత్ జిజ్ఞాసాయాం
సంప్రవృత్తో నాద్రియేత్కర్మచోదనాం-జీవస్యతి
త్యజిజ్ఞాసాం నార్థోయశ్చైవాకర్మభిః - కర్మణాబ
ధ్యతేజన్తుర్విద్యయాచ విముచ్యతే - జ్ఞానాత్తస్య
నివృత్తిఃస్యాత్ ప్రకాశాత్తమసోయధా-జ్ఞానంధ్వ
వంశాన్తికరం మహార్థమ్ - విద్యామయోయంపురు
షోనతుకర్మమయః స్మృతః - అను ఇత్యాద్యనేక
శృతిస్మృతిప్రమాణములచొప్పున జన్మహేతువు
లైన కర్మనుపరిత్యజించి, జన్మరాహిత్యముచేయు
స్వస్వరూపవ్యాప్తినిపొంది సుఖించుమని, ద్వైత
బుద్ధికలిగి కర్మమే శ్రేష్ఠమైనదనియు దానిని త్య
జించుట చండాలత్వమనియుండువారు వినకుండ,
బ్రహ్మవేత్తతాననెడి శిష్యునికి తాననెడుబ్రహ్మవి
ద్యను రహస్యముగబోధించును ఏలననగా, వారు
వినినయెడల స్పర్థచేయుదురు - చేసినను బాధక
ములేదు-స్వస్వరూపానుసంధానములేక, ఇట్టిబ్రహ్మా
నందానుభవమునకు పరంపరాసాధనమైన కర్మా
నుష్ఠానమును వదలి భ్రష్టులగుదురేమో అనేకారు
ణ్యముచే రహస్యముగ బోధింతురు. శ్రీరామ
మూర్తివాలిని చెట్టుచాటుననుండి కొట్టినట్టు చె
ప్పియుండుటకిదియే తాత్పర్యమని బ్రహ్మవేత్తలు

వక్కాణించెదరు. రాఘవ - అఘంపాపం, రాతినాశయతీతిరాఘః రాఘంతత్కృత్యం, వహతీతిరాఘవః, తస్యసంబుద్ధిరాఘవ, అనగా యీనామమును స్మరించువారి పాపములనునశింపజేసి, గగనముసకలమందును, సమస్తము గిగనమందునుండినను, ఆవస్తువులను, గగనమును, సకలవస్తువులును గగనమును స్పృశింపనటుల సకలభూతములయందుండియు వాని వికారకార్యములను స్పృశింపక వెలుగువాడు రాఘవుడు. మరియు, ఇతను సూర్యవంశమునందు బుట్టినవాడుగాన రాఘవుడనుపేరు వచ్చినదనిన-యథార్థమేను. "చంద్రమామనసోజాతః చక్షోసూర్యో అజాయత" అని శృతి గనుక సోమశబ్దమునకు స్వాతిరిక్తవస్తుజ్ఞానము కాబట్టి చంద్రవంశ్యులనగా బ్రహ్మవిద్యాపరిజ్ఞానములేని అజ్ఞానులు- "సర్వేంద్రియాణాంనయనం ప్రధానం" అనియున్నదిగావున, కన్నురూపము చూపునట్లు అమృతతత్వమును, అనగా "నమ్రియ్యతఇత్యమృతం" అనువ్యుత్పత్తిచేత నశింపని బ్రహ్మతత్వమిదియని కంటివంటివైన శృతిస్మృతి పురాణాదులుతెలుపుచున్నవి. కాబట్టిసూర్యవంశ్యులనగా అట్టి శృతిస్మృతిపురాణాదుల

నిజార్థము తెలిసిన అపరోక్షజ్ఞానముగల బ్రహ్మవేత్త
లు - మరియు కులమన, కౌలియ్యత ఇతికులమ
ని వ్యుత్పత్తిగాన మనుష్యశరీరము. ఇట్టిశరీరధా
రులగు బ్రహ్మజ్ఞానులయందు ప్రకాశించువాడు.
కృష్ణ - కృష్ కరణే అను ధాతువుచేత సృష్టిస్థి
తిలయములను జేయువాడా, లేక "కర్షత్వాత్కర్ష
త్వావిద్యకం బంధమితి" "కృషిర్భూవాచకశ్శ
బ్దోనశ్చనిర్వృతివాచకః తయోరైక్యాత్పరంబ్ర
హ్మ కృష్ణఇత్యభిధీయతే" అనురీతిని అజ్ఞానమనెడి
బంధమును త్రెంచివేయువాడా, అనగా- "ఆత్మనా
త్మనోర్దేహాదీన్ స్వేధ్యస్యాత్మత్వే నాభిమన్యతే
సోభిమానఆత్మనోబంధః" = ఆత్మ, తానుకా
నిదేహము మొదలగువాటిని తాననితలచుకొని అ
భిమానించుటచేత కలుగు ఆ, అభిమానమేబంధ
ము. (సర్వసారోపనిషత్.) ఇట్టి అభిమానమును
త్రెంచివేయువాడా - లేక, "వదంతితత్త్వవిదః
తత్త్వంయత్ జ్ఞానమవ్యయం, బ్రహ్మేతిపరమాత్మే
తిపరబ్రహ్మేతికీర్త్యతే" అనుస్మృతిచేత (సాధ
నాంతరనిరపేక్షస్వయం ప్రకాశమానవస్తుతత్త్వ
జ్ఞానమేస్వరూపముగాగలవాడా అని కృష్ణశబ్దము
నకర్థము ఇట్లుండగా శ్రీకృష్ణపరబ్రహ్మము, నందు

నింటనుండేననుటకు తాత్పర్యమేమి ! నందుడు-
నందత్యానందయతీతినందః అనుశబ్దోత్పత్తిచొ
ప్పున స్వరూపసాక్షాత్కార జ్ఞానము చేత బ్రహ్మానం
దవారాశిలో ఓలలాడువాడు నందుడు గాన బ్ర
హ్మవిద్వరిష్ఠుడే నందుడని సిద్ధించుచున్నది, ఇట్టి బ్ర
హ్మజ్ఞానియందు ప్రకాశించుటయే నందునింటనుం
డె ననుటకు తాత్పర్యము. ఓస్వామీ "తస్క
రాణాం పతయేనమః" అనుశృత్యభిప్రాయ
మును తెలియజెప్పునట్లు ప్రార్థించెదను ! "త
స్కరాణాంపతయేనమః" అను వేదప్రమాణ
ముచేతను "నారాయణో నామ నరో నరాణాం
ప్రసిద్ధచోరః కథితఃపృథివ్యాం, అనేకజన్మార్జితపా
పసంచితం హరత్యశేషంస్మృతిమాత్రమేవ" అ
నుస్మృతి ప్రమాణముచేతను, తన్నుతలచుచున్న
సకలజీవులు జన్మజన్మాంతరములయందు చేయబ
డిన సకలపాపములను హరించి వారికంటికి కన
బడకయుండు వాడగుటచేతయున్ను, మరియు
"పీతత్వంహియథాశుభ్రే భేపాదృవతికస్యచిత్"
అనున్యాయంబు చొప్పున తెల్లని పదార్థములు
పైత్యాది వికారములవలన పచ్చగ తోచినట్లు
" యద్వాచానభ్యుదితం యేనవాగభ్యుద్యతే"

"యన్మనసానమనుతే యేనాహుర్మనోమతం"
"యచ్చక్షుషానపశ్యతియేనచక్షూంషిపశ్యతి"
"యచ్ఛ్రోత్రేణనశృణోతియేన శ్రోత్రమిదంశ్రు
తం" "యత్ప్రాణేనప్రాణితియేనప్రాణః ప్రణీ
యతేతదేవబ్రహ్మత్వం విద్ధినేదంయదిదముపాసి
తే"=జనులు భిన్నమైన ఉపాధులతో కూడుకొ
న్న అనాత్మస్వరూపమగు ఏ ఈశ్వరాదికమును ఉ
పాసనచేయుచున్నారో అదిబ్రహ్మస్వరూపముకా
దు, వాక్కు మనస్సుశ్రోత్రముప్రాణవాయువు
మొదలగుఇంద్రియములచేప్రకాశించని, ఏపరబ్ర
హ్మస్వరూపముచేతవాక్కు మొదలగుసర్వేంద్రియ
ములుప్రకాశింప జేయబడుచున్నవో దానినేపర
బ్రహ్మస్వరూపమునుగా తెలిసికొనుమా అనిబోధిం
చుఇత్యాదికేనోపనిషద్వాక్యములరీతిని ప్రత్యక్ష
ముగనుండియు "సర్వంఖల్విదంబ్రహ్మ" "నేహ
నానాస్తికించన" అనుఇత్యాదివాక్యములచే స
ర్వస్వరూపుడైయుండిన్ని భ్రాంతిదృష్టిగలవారికి
అప్రత్యక్షుడుగాను భిన్నుడుగాను, తోచుటచే
అతనికి తస్కరుడని పేరుగలిగినదిగాని పరద్రవ్యా
పహారకుడగుటచేత కలిగినదికాదు-పైగా, ఇతని
కి "సత్యకామః" అనగా సత్యకాముడను పేరు

గలదు. నిత్యజ్ఞాన ప్రియత్వేచ్ఛలు గుణంబులు
గాన ఈనామము కలిగెననికొందరందరు. ఇతను
పూర్ణానంద బ్రహ్మస్వరూపుడు నిర్వికారుడుగాన
నిత్యజ్ఞానప్రియత్వేచ్ఛలు గుణంబులనిచెప్పంపగ
దు. "కామ్యతేయోగిభిః కామః, సత్యశ్చాసౌ
కామశ్చసత్యకామః" అనువ్యుత్పత్తిచేత సత్యు
లైనయోగులచేత కోరబడువాడా అనిఅర్థముస్ప
ష్టముగయేర్పడుచున్నది. "సత్యేనతపసాయోను
పశ్యతి" "సత్యంపరంపరంసత్యంసత్యేననసువర్గా
ల్లోకాచ్యవన్తే" ఇత్యాదిశృత్యర్థములను యోచిం
చుము. హరిః—హరతీతిహరిః అనివ్యుత్పత్తిగనుక
అనాద్యవిద్యానిష్పన్నస్వాతిరిక్తవస్తుత్వజ్ఞానమును
తత్సంబంధసకలదుఃఖములను నశింపజేయునట్టి
పరమాత్మ. రుద్రః-రుక్ సాంసారికదుఃఖం ద్రావయ
తినాశయతీతిరుద్రః అనువ్యుత్పత్తిచొప్పున సాం
సారికదుఃఖములను నాశముజేయువాడు. విభుః
విశేషేణభవతీతి విభుఃఅనెడివ్యుత్పత్తిచేత లోక
మందుయేప్రాణిపుట్టినట్టును గిట్టినట్టునుతోచుచు
న్నదోఆయాప్రాణి కధిష్ఠాన స్వరూపముగానుం
డుపరమాత్మ-దేవుడు-దేవేనప్రకాశేనదీవ్యతఇతి

దేవః, దివిప్రకాశే అని ధాతువుగనుక, దేవుడనగాప్రకాశస్వరూపుడు - ఆత్మ-అతతితత్తద్వస్తు రూపేణవ్యాప్నోతీతిఆత్మ, అతసాతత్యగమనే ఇతిధాతుఃఅనగాసమస్తవస్తు రూపముచేత అంతట నిండియుండునదిఆత్మ-ఇత్యాదిప్రమాణముల చొప్పున, సాధన చతుష్టయాదులతో గూడుకొనిన యోగ్యాధికారముగల బుద్ధిమంతులకు ప్రజ్ఞానఘనస్వరూపమునగుఆత్మస్వరూపము ఒకటియేయనెడిజ్ఞానముకలుగక మానదు-మరియు, "కతమఆత్మేతియోయంవిజ్ఞానమయః ప్రాణేషుహృద్యంతర్జ్యోతిఃపురుషః"=ఆత్మఎవడు ? ఎట్టివాడు ? విజ్ఞానమయుడు ప్రాణాదివాయువులలోపలను, హృదయములలోపలను ప్రకాశస్వరూపుడైన పురుషుడుగానున్నాడోవాడేయాత్మ-(బృహదారణ్యకోపనిషత్)"సవాఏషమహానజ ఆత్మాయోయంవిజ్ఞానమయః ప్రాణేషు"=ప్రాణములయందు ఏవిజ్ఞానమయుడు కనుబడుచున్నాడోవాడేమహామహుడుపుట్టువులేనివాడు, ఆత్మ (బృహదారణ్యకోపనిషత్) "కోఽయమాత్మేతివయముపాస్మహేకతరఃస ఆత్మాయేనవారూపం పశ్యతియేనవాశబ్దంశృణోతియేనవాగన్ధానాజిఘ్రతి యేనవా

వాచంవ్యాకరోతియేనవా స్వాదుచాస్వాదుచవి జానాతిసర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్యనామధేయా నిభవన్తి సఏష బ్రహ్మాఏషఇన్ద్ర ఏష ప్రజాపతిరేతేస ర్వే దేవా''=మనము ఉపాసించుచుండు ఆత్మ ఏది? ఏజ్ఞానము నేత్రమునుండి బయలు దేరినఅంతఃకరణ వృత్తితోకూడి యేజ్ఞానమువలన నలుపు తెలుపు మొదలైనవానిని చూచుచున్నదో, శ్రోత్రము నుండి బయలుదేరిన అంతఃకరణవృత్తితోగూడి యేజ్ఞానమువలన సకలశబ్దములను వినుచున్నదో, ఘ్రాణేంద్రియమునుండి బయలుదేరినఅంతఃకరణ వృత్తితోగూడికొని యేజ్ఞానము వలన త్రివిధ గంధములను ఆఘ్రాణించుచున్నదో, వాక్కునుం డి బయలుదేరిన అంతఃకరణవృత్తితోగూడి యే జ్ఞానమువలన చెప్పుచున్నదో, ఏజిహ్వేంద్రియ ముచేతను ఉప్పు పులుసు వగరు కారము మొదలగురుచినిన్ని అరుచినిన్ని తెలిసికొనుచున్నదో, చేయి మొదలైన సకలేంద్రియములనుండి బయలుదేరిన అంతఃకరణవృత్తితోగూడిబాహ్యాంతర సర్వవిషయములను యెరుగుచున్నదో-అదియే ప్రజ్ఞానస్వరూపమగు ఆత్మ - ఈప్రజ్ఞానాత్మయే బ్రహ్మ ఇంద్రుడు మొదలగు సమస్తదేవతలు-

మరియు, స్థూలశరీరావస్థయైన జాగ్రతయందు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియములనెడు చతుర్దశేంద్రియములచేత, తాననుభవించిన సుఖదుఃఖములను, సూక్ష్మశరీరావస్థయైనస్వప్నమునందు తాననుభవించిన సుఖదుఃఖములను, కారణశరీరావస్థయైన నిద్రయందు తాను సుఖముగానుండుటను మరల తనకు మెలకువవచ్చినప్పుడు చెప్పుట అనుభవముగనున్నది - త్రిశరీరములు అచేతనములగుటచేత మూడవస్థలలోని సంగతులను చెప్పజాలవు గనుకను, దేహములకంటె వేరుగా నొకడున్నాడని, నిస్సంశయముగ సిద్ధించుచున్నది - మరియు, అనిత్య ఆకారములయందు సంయోగ వియోగధర్మములుగల నేత్రాదీంద్రియములయొక్క దృష్టి మొదలైనవి, తృణాదిసంయోగమువలన బుట్టిన అగ్నియొక్క జ్వాలవలెనే అనిత్యములైనవి - సంయోగవియోగధర్మములులేనిదియును, నిత్యమైనదియునగు వస్తువునకు, సంయోగమువలన బుట్టినదృష్టి మొదలైనవానియొక్క అనిత్యధర్మము సంభవించదు - ఆప్రకారముగానే "నహిద్రష్టుర్దృష్టేర్విపరిలోపోవిద్యతే" అనుశ్రుతులు ప్రమాణములైయున్నవి-

యీప్రకారమైనయెడల, రెండుదృష్టులు కలుగు చున్నవేయనిన ? నేత్రముయొక్క దృష్టిఅనిత్యము ఆత్మయొక్కదృష్టినిత్యము-ఇదేప్రకారము-శ్రోత్ర ముయొక్కవినికి అనిత్యమైనది, ఆత్మస్వరూపము యొక్కవినికినిత్యమైనది-ఇదేప్రకారము మతివి జ్ఞానములు బాహ్యాబాహ్యములైనవి-ఇట్లునిత్యా నిత్యములును బాహ్యాబాహ్యములునగు రెండుదృ ష్టులు-"దృష్టేర్ద్రిష్టాశ్రుతేఃశ్రోతా" అనుఇత్యాది ప్రమాణములచేత అంగీకరింపబడినవి-చీకటియొ క్కసంయోగవియోగములయందుదృష్టినష్టమైనది దృష్టిపుట్టినదియని నేత్రదృష్టికనిత్యత్వము అను భవసిద్ధమైయున్నది-ఆప్రకారముగానే బాహ్య ములగు శ్రోత్రముమతిమొదలైన వాటికిన్ని అని త్యత్వము ప్రసిద్ధమయ్యేయున్నది - ఆత్మదృష్టి మొదలైన వాటికినిత్యత్వము ప్రసిద్ధముగనున్నది, ఎట్లు ? స్వప్నమునందు నేత్రములేకపోయిన ప్పటికిన్ని దృష్టియుండుటవలన ఆదృష్టి నేత్ర మువలనబుట్టినదికాదు నిత్యమైనది - స్వప్నము నందు నేత్రములేదని చెప్పినచో - ఆ, అవస్థలో చూచిన పురుషునియొక్క సౌందర్యమునున్ను, ధరించియుండు ఆభరణములనున్ను మెలుకువలో

చెప్పుచున్నాము - అచ్చటబినిన మంత్రములు చెప్పుచున్నాము - ఆత్మ యొక్క నిత్యదృష్టి వినుక మొదలైనవి, చక్షురాదీంద్రియములయొక్క సంయోగమువలన బుట్టినదే యైనయెడల బాహ్యదృష్టి వినుక మొదలైనవి కూడనుండవలెను, అట్లు గానము - లేక ఈచక్షురాదీంద్రియములకు పేరు గలేదనిన ఆనేత్రాదీంద్రియములులేకపోయిన స్వప్నావస్థయందు దృష్టి వినుక మొదలైనవి నశించి యేదియునగుపడక వినక పోవలయును అట్లాయెనేని "నహిద్రష్టుర్దృష్టే" "తచ్చక్షుఃపురుషేయేనస్వప్నంపశ్యతి" అనుశ్రుతులు వ్యర్థమగును అట్లు మనఅనుభవమునందు గానము, స్వప్నావస్థయందు అనుభవించినవాటిని మెలుకువలో నొకరికొకరు చెప్పకొనుచున్నాము - ఇట్టిఘటపటాది నామరూప మనోవృత్తికి సాక్షిస్వరూపంబగుబోధయేప్రజ్ఞానఘన స్వరూపంబగు ఆత్మ మరియు "తద్బ్రహ్మతాపత్రయాతీతం షట్కోశవినిర్ముక్తంషఢూర్మివర్జితం పంచకోశాతీతం షడ్భావవికారశూన్యమేవమాదిసర్వవిలక్షణం భవతి। తాపత్రయంతు ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికం। కర్తృకర్మకార్యజ్ఞాతృజ్ఞాన జ్ఞేయభోక్తృ

భోగభోగ్య మితిత్రివిధం । త్వఙ్మాంసశోణితాస్థి
స్నాయుమజ్జాష్టట్కోశాః కామక్రోధలోభమో
హామదమాత్సర్యమితిఅరిషడ్వర్గః। అన్నమయప్రా
ణమయమనోమయ విజ్ఞానమయానందమయా ఇ
తిపంచకోశాః । ప్రియత్వజననవర్ధన పరిణామక్ష
యనాశాష్షడ్భావాః । అశనాయాపిపాసా శోక
మోహజరామరణా నీతిషడూర్మయః । కులగో
త్రజాతివర్ణాశ్రమ రూపాణిషడ్భ్రమాః । ఏత
ద్యోగేనపరమ పురుషోజీవో భవతి" (ముద్గలోప
నిషత్.) "స్థూలసూక్ష్మాది దేహానామాత్మన్యారో
పవచ" ఆరోపమాత్రముగనుండు వ్యష్టిస్థూల
శరీరజాగ్రదవస్థనుబట్టి సమస్తమందున్ను అభి
మానంబుచేసిన ప్రజ్ఞానఘనస్వరూపమగు ఆత్మకు
విశ్వుడనిన్ని - సమస్తవ్యవహారంబులు సేయుచు
న్నాడు గాన వ్యావహారికుడనిన్ని - చిల్లక్షణము
లేనిఅహమనెడిబుద్ధి వృత్తులయందు ప్రకాశించు
చున్నాడుగాన చిదాభాసుడనిన్ని - సమష్టిస్థూల
శరీరజాగ్రదవస్థయందు నానావిధవస్తువులయందు
విశేషముగా ప్రకాశించుచున్నాడుగాన విరా
ట్టనిన్ని, సమస్త నరులయందున్నాడుగాన వైశ్వా
నరుడనిన్ని - విశేషంబుగా దోచుచున్నాడు

గాన వైరాజసుడనిన్ని - వ్యష్టిసూక్ష్మశరీరస్వ ప్నావస్థయందు, తేజోరూపమై అంతఃకరణవృ త్తితోఁగూడుకొన్నవాడుగాన తైజసుడనిన్ని-వృ త్తులతోఁచుకాలమందు వేరైయెఱుఁగువాడుగాన ప్రాతిభాసకుడనిన్ని - అజ్ఞానకార్యమైన నిద్రా శక్తితో కల్పింపబడును గనుక స్వప్నకల్పితుడ నిన్ని, సమష్టి సూక్ష్మ శరీరస్వప్నావస్థయందు జ్ఞానశక్తిగలవాడుగాన హిరణ్యగర్భుడనిన్ని - "మణిగణేసూత్రమివ" అనురీతిని నానావి ధంబులైన మణులయందు కూర్చబడిన సూత్రం బువలెనే నానావిధప్రపంచమందు అనుస్యూత మైయున్నాడు గాన సూత్రాత్మయనిన్ని, క్రియా శక్తితోఁ గూడుకొనియున్నాడు గాన ప్రాణు డనిన్ని - వ్యష్టికారణశరీర సుషుప్త్యవస్థయం దు స్వప్రకాశ స్వరూపుడుగా నున్నాడుగాన ప్రాజ్ఞుడనిన్ని, అవస్థాత్రయంబులయందు అను స్యూతుడైయున్నాడు గనుక పారమార్థికుడని న్ని - దేహేంద్రియాదులు ఒక అవస్థలోనుండి ఒక అవస్థలోఁలేక, భిన్నమైనను ఇతడు అభిన్ను డుగానుండుటచేత అపరిచ్ఛిన్నుడనిన్ని - సమ ష్టికారణ శరీరసుషుప్త్యవస్థయందు - "సుషు

స్తథా నఏకీభూతః ప్రజ్ఞానఘనఏవ'' అనురీతిని సమస్తప్రాణిబుద్ధులయొక్క వాసనలనుతనయం దులయింపజేసుకొని, జాగ్రత్స్వప్నాది ప్రపంచ మును సృష్టింపజేయుచు నుండుటచే ఈశ్వరుడ నిన్ని - సమస్తప్రాణులయొక్క విజ్ఞానమయ ము మొదలగు కోశములందును పృథివ్యాదుల యందును లోగానున్నవాడై ప్రేరేపించుచున్నా డుగనుక అంతర్యామియనిన్ని -నామరూపరహితు డైయున్నాడుగనుకఅవ్యాకృతుడనిన్ని పేళ్లుకలి గెను-మరియు, యెట్లుసూర్యకిరణమందు దోచిన యెండమావులకు వస్తుత్వము లేదో అటువలెశో ధనయందు వస్తుత్వములేక అధ్యాసపూర్వకము గతోచు స్థూలసూక్ష్మకారణ దేహములును, వా నియందలి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును, అ న్నమయాది పంచకోశములు, విశ్వతైజసాదినామ ములును ప్రజ్ఞానఘనస్వరూపమునగు పరమాత్మ కాదు-పరమాత్మ నశింపనిదిగనుక దేహేంద్రియా దులే పరమాత్మయనుట ప్రత్యక్షవిరోధము కాబ ట్టి, ఆదేహేంద్రియాదులనువదలి, వీనికివిలక్షణము గుపరమాత్మయున్నాడనుట జహల్లక్షణము-ఈజ హల్లక్షణమునంగీకరించిన యెడలఛాందోగ్యమున

“సర్వంఖల్విదంబ్రహ్మ*తజ్జలానితిశాంతఉపాసీత” “మోక్షఏవపరమపురుషార్థః” ఇత్యాది వాక్యములనుసంధానమునకు ఉపాసకుడును ముముక్షువును లేకపోవుచున్నారుగాపున అందు నిమిత్తము అజహల్లక్షణమును గ్రహింపవలయును - అజహల్లక్షణమనగా యీదేహేంద్రియాదులతో కూడిజీవుడైన తాను తనకు ఉపాస్యుడైన యీశ్వరునియొక్క నామములను విడువక. “భవే భవేనాతిభవే భజస్వమాంభవోద్భవాయనమః” = అనేకజన్మములు కలుగకపోనుగాక, నన్ను అనుగ్రహింపుము - కార్యజాతమునకు కారణుడైన నీకొఱకు నమస్కారము. “అన్నమయప్రాణమయ మనోమయవిజ్ఞానమయానంద మయామేశుద్ధ్యన్తాం జ్యోతిరహం విరజావిపాప్మా భూయాసగ్”=అన్నమయాది పంచకోశములు పరిశుద్ధములై ఆనందస్వరూపుడైన పరమాత్మయొక్క సేవాద్యుపాయములచేతను అనుగ్రహింపదగినవగును గాక, స్వయంప్రకాశమగు బోధా

---

* తజ్జలాన్ = తజ్జం = బ్రహ్మమునుండి పుట్టి - తల్లం = బ్రహ్మమందే లయమై-తదన్ = బ్రహ్మమువలననే చేష్ట కలదగుచున్నది.

నందఘనస్వరూపమైన నేను రజోగుణములేని వాఁడను, తిరస్కరించిన పాపముగలవాఁడనగుదునుగాక - "ఉత్తిష్ఠపురుషహారీ" = పరిపూర్ణుఁడవు సమస్తపాపములను హరించువాఁడవగు ఓకరుణానిధీ! నీవునన్నురక్షించుటకు ఆలస్యముచేయక రమ్ము. "త్వద్వ్యాపైకజ్ఞానశక్త్యాదికందేహిదేహి" = నీవిషైకమగు జ్ఞానశక్తిమొదలైనదానినిఇమ్ము-ఇమ్ము-అను ఇత్యాదిశ్రుతులచొప్పున ధ్యానించుచు - వాని విచిత్రచరిత్రములను స్తుతించుచు, నవవిధములైన అంగములుగల త్రివిధభక్తులచేత ఆరాధించుచు అపరోక్షజ్ఞానము కలిగెడు వరకు, వీనిని విడువకయుండుటయే అజహల్లక్షణము. జహదజహల్లక్షణమునుకొని లక్ష్యార్థమునుగ్రహించి, నిష్ఠయందుండి, తద్వారా లభించు సుఖామృతపానముచే మైమఱచినస్థితి అనగా, ఆ; అవసరమే వైకుంఠ వాసస్థానము, కైలాసము, స్వర్గము, నాకము, పరమపదము ఇత్యాది భూములనుపొందినస్థితి అని బ్రహ్మవేత్తలుచెప్పెదరు. అదెట్లనిన - కుంఠం = నశించునది, అజ్ఞానము-వైకుంఠం అనగా నశింపనిదిజ్ఞానము. "చైతన్యంవినాకించిన్నాస్తీతిసాక్షాత్కా-

రానుభవంజ్ఞానం" (నిరాలంబోపనిషత్.) "బ్ర
హ్మజ్ఞానం సమూలానాత్మ నివర్తకం సద్బ్రహ్మణివి
లీయతె" (సర్వసారోపనిషత్.) కైలాసము -
కేళీనాం ఆనందానాం సమూహః, కైలం, తేన
అస్యతేస్థీయత ఇతి కైలాసః, అని వ్యుత్పత్తి -
అస ఉపవేశనేయని ధాతువు - కేళియనగా -
ఆనందము, దానిగుంపుకైలము, దానిచేతనుండు
నది అనగా ఆనందము - "ఆనందోబ్రహ్మేతివ్య
జానాత్" (తైత్తిరీయోపనిషత్.) స్వర్గము -
"సత్సంసర్గస్స్వర్గః" (నిరాలంబోపనిషత్.) =
సత్తామాత్రముగ ప్రకాశించు బ్రహ్మమునందు
దృశ్యమాన ప్రపంచవికార సంబంధవృత్తులులేక
నిలుచుటయేస్వర్గము. నాకం = పరమపదమైన
భగవల్లోకమనిశబ్దార్థము - కంసుఖంతన్నభవతీ
త్యకంతన్నాస్త్యత్రేతినాకః అనివ్యుత్పత్తి - కం
అనగా సుఖము అదిగానిది అకము అనగా దుః
ఖము ఈసుఖదుఃఖద్వంద్వమునకు "చిత్తంచసు
ఖదుఃఖేతి" అను రీతిని కారణమైనది చిత్తము,
ఆచిత్తవృత్తి, లయించినస్థానము సుఖస్థానము
"తద్విష్ణోఃపరమంపదం" శృతిప్రమాణరీతిని నా
కము - ఇందుకుమరియొక శృతికద్దు. "సచ్చిదా

ఽనన్దాఽనుభవస్వరూపంజ్ఞాత్వాఽనన్ద రూపావస్థితిరేవసుఖం" = సచ్చిదానందస్వరూపానుభవస్థితియేసుఖము. (నిరాలంబోపనిషత్.) పరమపదము - "ప్రాణేంద్రియాద్యంతః కరణగుణాదేః పరతరం సచ్చిదానందమయం సర్వసాక్షికం నిత్యముక్తబ్రహ్మస్థానం పరమపదం". (నిరాలంబోపనిషత్.) = ప్రాణేంద్రియాంతః కరణం, గుణములు మొదలగు వాటికంటె శ్రేష్ఠముగానున్న సచ్చిదానంద స్వరూపముగానున్న సర్వమునకు ఉపద్రష్టయైయుండు స్వరూపమునాశ్రయించి యుండు నిత్య ముక్తబ్రహ్మస్థానమే పరమపదం- ఇత్యాదిశృత్యర్థములను ఏకాంతమునకూర్చుండి మననముచేసి నిధిధ్యాసమునకు తీసుకొచ్చుకొనిన, యదార్థమని, నిస్సంశయముగ తోచును, నిరతిశయసుఖము తప్పకలభించును - ఇట్టి నిర్వికల్పనిష్ఠనుపొంది సుఖించక ఇత్యాది ప్రమాణములను తెలిసికొని, ప్రత్యక్షముగా కను. పడునదేలోకమనిన్ని ఇంతకువేరైన పరలోకమే లేదని తలంచువాడు మాటిమాటికి పుట్టుచు గిట్టుచు నాయధీనమగు చున్నాడని కఠోపనిషద్వాక్యము బోధించుచున్నది. "అయంలోకో

నాస్తి పరఇతి మానీపునః పునర్వశమాపద్యతే మే''
పరలోకములు లేవని చెప్పుట కూపకూర్మన్యాయ
మని పెద్దలు చెప్పెదరు - జహదజహల్లక్షణమన
గాసద్గురువు - నిర్హేతుక కరుణచేత, ఉపదేశించు
క్రమము ననుసరించి బోధించుతత్త్వమసి, త్వమే
వతదసి, త్వంబ్రహ్మాస్మి - అహంబ్రహ్మాస్మి - అవ
యోరంతరం నవిద్యతే, త్వమేవాహమ హమేవ
త్వం - అనుఇత్యాది మహావాక్యములచేత లభిం
చినజ్ఞాన చక్షుస్సుచేత, అవిద్యాకల్పితములైన
జీవశరీరాదులను, మాయాకల్పితములైన యీశ్వ
రశరీరాదులనువిడిచి. జీవసాక్షియైన ప్రత్యగా
త్మను, యీశ్వరసాక్షియైన పరమాత్మను విడువక
దీపప్రకాశమే దివిటీప్రకాశమైనట్లును, ఘటము
నష్టముకాగానే తద్ఘటాకాశము బృహదాకాశ
మందు ఐక్యమయినట్లు ప్రత్యగాత్మయే పరమాత్మ
యనిఐక్యపరచుకొని, "సయధా సైన్ధవఘనో
నన్తరోబాహ్యః కృత్స్నోరసఘన ఏవైవంవాఅ
రేఽయమాత్మాఽనన్తరోబాహ్యః, కృత్స్నః ప్రజ్ఞా
నఘనఏవేతి'' "పురుషఏవేదంవిశ్వం'' "యస్మాత్ప
రంనాపరమస్తికించిత్ తేనేదం పూర్ణంపురుషేణస
ర్వం'' "నతుతద్ద్వితీయమస్తి,తతోన్యద్విభక్తం''

ఇత్యాది శ్రుతులరీతిని, అంతటనిండియున్నప్రకాశస్వరూపమే రూపముగాగలవాడనను, పూర్ణాపరోక్షజ్ఞానము గలవాడై ప్రకాశించుచుండుము. నిర్మలహృదయము గలసత్పురుషుడా! నిర్వాసనామౌననిష్ఠ యందుండుము ఇట్టి నిష్టయందుండి మఱలి ప్రపంచముతట్టు తిరిగినట్లుఅనుభవము లేనివారనుకొనినను, సమస్తప్రపంచముచిన్మాత్రస్వరూపము, చిన్మయ వ్యతిరిక్తము పొట్టంత మాత్రమైననులేదని అనేకశృతి స్మృతులనుకొని తీర్మానించిన అనుభవ దృష్టియం దుండుకొని, నీవునేనుఅన్యము అనుభేదబుద్ధిలేక నిద్రించినవాడు నిద్రనువదలి మెలుకువకువచ్చి నప్పుడు నిద్రయొక్క సుఖమును గొనియాడికొని నట్లు తానైన బ్రహ్మానందమును గొనియాడుచుండుము.

నారాయణ నారాయణ నారాయణ

శ్రీమదఖండ నిత్య నిర్మలాద్వయ సచ్చిదానంద పరబ్రహ్మణేనమః.

శ్రీమత్సద్గురు శాన్తానన్ద స్వామి సచ్చరణార విందాభ్యాం నమోనమః.

# శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | పఙ్త్తి. | తప్పులు. | ఒప్పులు. |
|---|---|---|---|
| ౬ | ౭ | వూర్థ్వ | ఊర్థ్వ |
| ౮ | ౧౫ | అంతరంబై | నంతరంబై |
| ౧౧ | ౬ | అంతరం | నంతరం |
| ౧౨ | ౮ | సంధ | సంత |
| ౧౩ | ౧౦ | అంతరంబగు | నంతరంబగు |
| ౧౬ | ౧౭ | మమాయం | మమేయం |
| ౧౮ | ౨౦ | అంతరమందు | యంతరమందు |
| ౩౦ | ౧౭ | విభజ్యాతేతి | విభజ్యతఇతి |
| ౩౩ | ౪ | మిథ్యా | న్మిథ్యా |
| ,, | ౧౦ | నినాయత్వాత్ | వినాయత్వాత్ |
| ౩౬ | ౨౧ | షేవ | ఏవ |
| ౬౯ | ౧౧ | శ్చక్షు | చక్షు |

ఓమ్

శ్రీమత్సద్గురు శాంతానంద స్వామి సత్చరణార
విందాభ్యాం నమోనమః.

హరిఃఓమ్ ॥ సహనావవతు । సహనౌభునక్తు ।
సహవీర్యంకరవావహై । తేజస్వినావధీతమస్తు । మావిద్విషా
వహై । ఓమ్శాన్తిశ్శాన్తిశ్శాన్తిః ॥

(తైత్తిరియోపనిషత్.)

నిత్యానందంపరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం।
ఏకంనిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం।
భావాతీతంత్రిగుణరహితంసద్గురుంతన్నమామి ।

(శుకరహస్యోపనిషత్.)

నిత్యానందాయదత్తాయ నిర్మలాయచిదాత్మనే।
జ్ఞానోత్తమాయగురవే తస్మైశ్రీగురవేనమః॥ ౧

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా।
చక్షురున్మీలితంయేన తస్మైశ్రీగురవేనమః॥ ౨

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః॥ ౩

గురుశ్శివో గురుర్దేవో గురుర్బంధుశ్శరీరిణాం।
గురురాత్మా గురుర్జీవో గురోరన్యం నవిద్యతే॥ ౪

న సుఖం వేదశాస్త్రేషు నసుఖంమంత్రయంత్రకే।
గురోఃప్రసాదాదన్యత్ర సుఖంనాస్తి మహీతలే॥ ౫

గురుర్విష్ణుస్సత్త్వమయో రాజసశ్చతురాననః।
తామసోరుద్రరూపేణ సృజత్యవతిహంతిచ॥ ౬

స్వయంబ్రహ్మ మయోభూత్వా తత్పరంచావలోక
యేత్ ।పరాత్పరతరంనాన్య త్సర్వ గంతన్నిరా
మయం॥ ౭

కామ్యానాంకామధేనుర్వై కల్పితేకల్పపాదపః।
చింతామణిశ్చింతితస్య సర్వమంగళకారకం॥ ౮

భవమూలవినాశాయ చాష్టపాశానివృత్తయే।
గురుగతాంభసిస్నానం తత్త్వజ్ఞ కురుతేసదా॥ ౯

సత్యానందరూపాయ బోధైకసుఖకారిణే ।
నమో వేదాంత వేద్యాయగురవేబుద్ధిసాక్షిణే॥ ౧౦

సచ్చిదానందరూపాయ వ్యాపినేపరమాత్మనే ।
నమశ్శ్రీగురునాథాయప్రకాశానందమూర్తయే॥౧౧

నగురోరధికంజ్ఞానం నగురోరధికంతపః।
నగురోరధికంధ్యానంనాస్తితత్త్వంగురోఃపరం॥౧౨

నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగు
రోరధికం। శివశాసనతశ్శివశాసనతశ్శివశాసనతశ్శి
వశాసనతః॥ ౧౩

ఇదమేవశివం ఇదమేవశివం। ఇదమేవశివం ఇద
మేవశివం। మమశాసనతో మమశాసనతో మమ
శాసనతో మమశాసనతః॥ ౧౪

విదితం విదితం విదితం విదితం విజనం విజనం
విజనం విజనం। హరశాసనతో హరిశాసనతో
హరిశాసనతో హరిశాసనతః॥ ౧౫

ఏవంవిధంగురుధ్యాత్వా జ్ఞానముత్పద్యతేస్వయం।
తథాగురూపదేశేనముక్తోహమితి భావయేత్॥౧౬

స్కాందపురాణాంతర్గత, ఉత్తరఖండమునందు
ఉమామహేశ్వరసంవాదమునందలి గురుగీతయం
దుండు శ్లోకములు.

నారాయణ నారాయణ నారాయణ
శ్రీ మత్సద్గురు శాంతానంద స్వామిన శ్చరణార
విందాభ్యాం నమోనమః.

ఓమ్

సర్వాకారంసర్వమసర్వంసర్వనిషేధావధిభూతం।
యత్సత్యంశాశ్వతమేకమనంతం శుద్ధంబుద్ధంతత్త్వ
మసిత్వం॥ ౧

నిత్యానందాఖండరసైకం నిష్కళమక్రియమస్తవి
కారం। ప్రత్యగభిన్నంపరమవ్యక్తం శుద్ధంబుద్ధం
తత్త్వమసిత్వం॥ ౨

ప్రత్యస్తమితాశేషవిశేషం వ్యోమేవాంతర్బహి
రపిపూర్ణం।బ్రహ్మానందం పరమాద్వైతంశుద్ధం
బుద్ధంతత్త్వమసిత్వం॥ ౩

జ్ఞాతృజ్ఞానజ్ఞేయవిహీనం జ్ఞాతురభిన్నంజ్ఞానమఖం
డం।జ్ఞేయాజ్ఞేయత్వాదివిముక్తం యచ్ఛుద్ధంబుద్ధం
తత్త్వమసిత్వం॥ ౪

అంతఃప్రాజ్ఞత్వాది వికల్పైరస్పృష్టప్రత్యగ్రూ
పం భావృత్తిమాత్రంగగనాభం సత్తామాత్రం సమ
రసమేకంయచ్ఛుద్ధంబుద్ధంతత్త్వమసిత్వం॥ ౫

నారాయణ నారాయణ నారాయణ.

శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులచే
రచింపబడిన శ్లోకములు.

శ్రీమత్సద్గురు శాన్తానందసరస్వతీ స్వామినశ్చ
రణారవిందాభ్యాంనమోనమః

ఓమ్.

శ్రీమత్సద్గురు సదానందసరస్వతీ స్వామిసచ్చ
రణార విన్దాభ్యాం నమోనమః
పరబ్రహ్మాష్టోత్తర శతనామావళి.

ఓమ్ అఖండానన్ద స్వరూపాయనమః
,, అచలాయనమః
,, అచిన్త్యాయనమః
,, అజాయనమః
,, అద్వితీయపరమానన్ద శుద్ధబుద్ధముక్తసత్యస్వ
,, అద్భుతాయనమః (రూపాయనమః
,, అనన్తరూపాయనమః
,, అన్తర్బహిశ్చాకాశవదను స్యూతాయనమః
,, అపరోక్షాయనమః
,, అప్రమేయాయనమః
,, అమనస్కమశ్రోత్రమపాణి పాదజ్యోతిర్వి
,, అమృతతత్త్వాయనమః (దితాయనమః
,, అరూపాయనమః
,, అవ్యక్తాయనమః
,, అవ్యయాయనమః
,, అవ్యాకృతాకాశాయనమః

ఓమ్ అశేషకల్పాధారాయనమః

,, అశేష భూతాన్తర్యామిత్వేన వర్తమానాయ

,, అహంబ్రహ్మాస్మీత్యాకారాయనమః (నమః

,, అక్షరాయనమః

,, అంబరాయనమః

,, ఆదిపురుషాయనమః

,, ఆధారాధేయరూపాయనమః

,, ఏకాత్మనేనమః

,, కల్పనారహితాయనమః

,, కృపానిధయేనమః

,, చతుర్వింశతితత్వాతీతాయనమః

,, చతుర్వింశతితత్వాధారాయనమః

,, చతుర్వేదవిదేనమః

,, చిదాకాశాయనమః

,, చిన్ముద్రాయనమః

,, ఛిన్నసంశయాయనమః

,, జగద్వ్యాపినేనమః

,, జగద్గురవేనమః

,, జరామరణవర్జితాయనమః

,, తత్వమసీత్యాది మహావాక్యలక్ష్యార్థ స్వరూ

,, తత్వాయనమః పాయనమః

ఓమ్ త్రిగుణాతీతాయనమః
,, తుర్యాతీతాయనమః
,, దివ్యజ్ఞాననిదర్శనాయనమః
,, ద్వైతాద్వైతవిశిష్టాయనమః
,, ధర్మాధర్మవివర్జితాయనమః
,, నచాంకురాయనమః
,, నారాయణాయనమః
,, నిజబోధాయనమః
,, నిత్యతృప్తాయనమః
,, నిత్యముక్తస్వరూపాయనమః
,, నిరన్తరమవృత్తివృత్తిసాక్షిచైతన్యరూపాయ నమః
,, నిరాసనాయనమః
,, నిర్వాణాయనమః
,, నిర్వికారాయనమః
,, నిర్జీవజీవనాయనమః
,, నిర్గుణాయనమః
,, నిర్దోషాయనమః
,, నివృత్తాత్మనేనమః
,, నిష్కళనిరంజనేత్యాదిరూపాయనమః
,, నిష్టాయైనమః
,, పరబ్రహ్మణేనమః

ఓమ్ పరమపురుషాయనమః
,, పరమాత్మనేనమః
,, ప్రకాశాత్మనేనమః
,, ప్రబోధయేనమః
,, ప్రసన్నాత్మనేనమః
,, ప్రభవేనమః
,, పండితారాధ్యాయనమః
,, పరంజ్యోతిషేనమః
,, పరాకాశాయనమః
,, పరాత్పరాయనమః
,, పాశవిమోచకాయనమః
,, పునరావృత్తినాశాయనమః
,, పురాణపురుషోత్తమాయనమః
,, బిందునాదకళాతీతాయనమః
,, బృహదాకాశాయనమః
,, మనోవాచామగోచరాయనమః
,, మహాతపసేనమః
,, మహానాదాయనమః
,, మహాపురుషాయనమః
,, మాయాతీతాయనమః
,, యదవిదుసాందూరాత్సుదూరాయనమః

ఓమ్ వ్యష్టిసమష్ట్యుపాదిరహిత బోధానన్దఘనస్వ

,, వాసుదేవాయనమః (రూపాయనమః

నిజితాత్మనేనమః

,, [redacted]త్మనేనమః

,, విశుద్ధాన్తఃకరణముముక్షుజనానుభవవేద్యా

,, వేదవేద్యాయనమః (యనమః

,, వేదవేదాన్తలక్షణాయనమః

,, వేదాన్తసారాయనమః

,, వ్యోమాతీతాయనమః

,, శాశ్వతాయనమః

,, శివాయనమః

,, శ్రేష్ఠాయనమః

,, సజాతీయవిజాతీయస్వగతభేదరహితాయన

,, సత్యజ్ఞానానన్తానన్దస్వరూపాయనమః (మః

,, సత్యాయనమః

,, సదాజనానాంహృదయేసన్నివిష్టాయనమః

,, సద్రూపాయనమః

,, సర్వతశ్చక్షుషేనమః

,, సర్వదేవాత్మకాయనమః

,, సర్వదేవాదిదేవాయనమః

,, సర్వవాసినేనమః

ఓమ్ సర్వవ్యాపకాభిన్నాపరిచ్ఛిన్నరూపాయన (మః
,, సర్వాత్మనేనమః
,, సర్వేంద్రియవివర్జితాయనమః
,, సర్వోపాధివినిర్ముక్తాయనమః
,, స్వయంనిర్వికల్పాయనమః
,, స్వయంప్రభాయనమః
,, సాత్వికాయనమః
,, మృద్వికారేషుమృదివ, స్వర్ణవికారేషుస్వర్ణమివ, తంతువికారేషు తంతురివ, అవ్యక్తాదిసృష్టిప్రపంచేషు వ్యాప్యపూర్ణమవినాశచైతన్యస్వరూపాయనమః

నారాయణ నారాయణ నారాయణ.

శ్రీపరబ్రహ్మాష్టోత్తర శతనామావళి
సంపూర్ణం.

శ్రీమత్సద్గురు శాంతానంద స్వామి సచ్చరణార
విందాభ్యాం నమోనమః.